జాతీయ జీవిత గ్రంథమాల

# హరినారాయణ్ ఆప్టే

రచన:
ఎస్. ఎ. కరందికర్

అనువాదము:
ఎమ్. నాగభూషణశర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూఢిల్లీ

March 1973 (Palguna 1894)
మార్చి 1973 (ఫాల్గుణ 1894)

© ఎస్. ఎ. కరందికర్ 1968

HARINARAYAN APTE (TELUGU)

Rs. 2-25

డిస్ట్రిబ్యూటర్సు:
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్డు
సికింద్రాబాదు

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA
A-5, GREEN PARK, NEW DELHI-16
PRINTED AT SOLAR WORKS
12, THAMBU CHETTY STREET, MADRAS-1.

# పీఠిక

అనాది కాలంనుంచీ మన దేశంలో ప్రతి జీవన రంగంలోనూ ప్రతిభావంతులైన వ్యక్తులెందరో జన్మించారు. విజ్ఞాన శాస్త్రానికి, సంగీత సాహిత్యాలకు, రాజకీయాలకు వారుచేసిన సేవ అమోఘమైనది. అందులో కొన్ని పేర్లు ప్రతియింటా తెలిసినపేర్లు. ఇందులో చాలామంది పేర్లువిని ఉన్నా, ప్రజలకు వారి జీవితాన్నిగురించి, వారు చేసిన మహత్కార్యాలను గురించి అంతగా తెలియదు. ఎంతో ప్రజ్ఞా ప్రాభవాలు ఉండీ, ఎన్నో మహోత్కృష్టమైన కార్యాలను సాధించిన వారెందరిని గురించో మనకు దాదాపు ఏమీ తెలియదనే చెప్పాలి.

ప్రతిదేశ చరిత్రకూడ–ఎక్కువ భాగం–ఆ దేశంలో ప్రఖ్యాతులైన స్త్రీ, పురుషుల చరిత్ర అని చెప్పవచ్చు. దేశ ప్రగతికి, నిర్మాణానికి వారు కారకులు. మన దేశం వివిధరంగాలలో ఎలా అభ్యుదయం సాగించిందో గ్రహించాలంటే ప్రతివారుడూ ఆ స్త్రీ పురుషులను గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంది.

మరాఠీ సాహిత్యంలో హరినారాయణ్ ఆప్టే ప్రఖ్యాతుడు. మరాఠీ నవలా సాహిత్యం ఆయనవల్లనే సక్రమమైన మార్గంలో నడిచింది. ఆయన సాహిత్య జీవితం ప్రారంభించిన తొలి రోజులలో సంఘంలో ఉన్న మధ్య తరగతి ప్రజల జీవితాలనుగురించి, వారి సమస్యలనుగురించి వ్రాశారు. ఆ తరువాత చారిత్రక–కాల్పనిక

గాథలను స్వీకరించారు. కేవలం సాహిత్య ప్రవర్తకాడవడంవల్లనే కాకుండా, తన నవలలద్వారా, ఇతర సాంఘిక వ్యాసంగాలద్వారా ఆయన హిందూ సంఘ అభ్యుదయానికి ఎన్నో విధాల కారకుడు కావడంవల్లకూడా మహారాష్ట్ర దేశంలో ఆయన పేరు చిరస్థాయిగా నిలిచివుంటుంది. ఆయన గొప్ప నవలారచయిత. సాంఘిక సేవకుడు.

'జాతీయ జీవిత గ్రంథమాల' కు ఈ గ్రంథాన్ని వ్రాసియిచ్చిన డాక్టర్ ఎస్. ఎ. కరందికర్ కు మా కృతజ్ఞత.

న్యూఢిల్లీ, బి. వి. కేస్కర్.
అక్టోబరు 4, 1968

ఒకటో అధ్యాయం

# బాల్యం

కొంకణ్ ప్రాంతంలో స్థిరపడిన చిత్ పావన్ బ్రాహ్మణ కుటుంబాలలో ఆప్టేల కుటుంబం ఒకటి. హరినారాయణ్ ఆప్టే తాతగారు మహారాష్ట్రంలో ఉన్న ఖాందేశ్‌లో తాలూకా అధికారిగా ఉండేవారు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు, నలుగురు కుమారులు. వారిలో నారాయణ్ ఒకడు. ఆయన కుమారుడే హరినారాయణ్ ఆప్టే. ఆనాటి పరిస్థితులనుబట్టి వారి కుటుంబం కొంచెం కలవారి కుటుంబమనే అనుకోవచ్చు.

ఖాందేశ్‌లో మామ్లత్‌దార్ అయిన శ్రీ గణ్‌పత్‌రావు పరాంజపేగారి కుమార్తె యాము లక్ష్మిని నారాయణ్ ఆప్టే వివాహం చేసుకొన్నాడు. నారాయణ్, అతని సోదరుడు మహాదేవ్ ఇరువురు వారుంటున్న గ్రామంలో చదువు పూర్తి అయిన తర్వాత ఇంకా చదువుకోవలెనను కొన్నారు. వారితల్లి వారిద్దరిని పూనాలో ఉన్న గవర్నమెంటు హైస్కూల్లో చదవడానికి పంపింది. కాని వారి ఆర్థిక పరిస్థితులనుబట్టి వారిద్దరూ ఉన్నత విద్య నభ్యసించడం సాధ్యం కాదని నారాయణ్ గ్రహించి తాను చదువు మానుకొన్నాడు. వెంటనే ఇందోర్‌లో నెలకు పది రూపాయల జీతంమీద ఒక చిన్న ఉద్యోగంలో చేరాడు. ఆయన ఇందోర్ వదిలేసరికి ముప్పది రూపాయల జీతము పుచ్చుకొంటూ ఉండేవాడు. మహాదేవ్ చాలా

తెలివైనవాడు కావడంచేత అతని చదువుకు నారాయణ్ ప్రతినెలా పైకం పంపేవాడు.

ఇండోర్‌లో ఉండగా నారాయణ్ భార్య లక్ష్మికి 1864 వ సంవత్సరము మార్చి 8 వ తేదీన ఒక మగపిల్లవాడు కలిగాడు. (ఇతనే హరి). ఆ రోజు శక సంవత్సరము 1785 మాఘ అమావాస్య అయింది. మగపిల్లవాడు కలిగినందుకు నాయనమ్మ బగుతాయీ చాలా ఆనందించింది.

ఆ సంవత్సరంలోనే ఆప్టే కుటుంబము పూనాచేరింది. ఇండోర్‌లో ఉద్యోగం చాలించుకొని 1867 లో నారాయణ్ బొంబాయిలో భారత తపాలా శాఖలో ఉద్యోగిగా చేరాడు. 1867 నవంబరులో మహాదేవ్ బి. ఎ. పరీక్షలో ప్రథమ స్థానంలో ఉత్తీర్ణుడయాడు. అంతటితో కలిసి ఉండడానికి వీలుగా కుటుంబమంతా బొంబాయి చేరారు. 18 8 లో హరి తల్లి లక్ష్మీబాయి మూడవ బిడ్డ కలగగానే బాలింత జాడ్యంవల్ల చనిపోయింది. పుట్టిన పసిబిడ్డకూడా గతించింది. హరి కన్నముందుపుట్టిన ఆడపిల్లకూడా ఒక రైలు ప్రయాణంలో న్యూమోనియావల్ల చనిపోయింది.

హరి తల్లిచావును ప్రత్యక్షంగా చూచాడు. నాలుగు సంవత్సరాల వయస్సు కలవాడే అయినా తల్లిచావు అతని మనస్సుమీద చెరగని ముద్ర వేసింది. చనిపోయేటప్పుడు ఆమె అన్న మాటలను హరినారాయణ్ ఆప్టే తన నవల "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో"లో పొందుపరిచాడు. లక్ష్మీబాయి చావు బ్రతుకులలో ఉండగా హరి యొక్క బాగోగులను తాను చూస్తానని మహాదేవ్ ఆమెకు వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానాన్ని ఆయన అక్షరాలా నిలబెట్టుకొన్నాడు కూడా. తన తల్లి ప్రేమను హరి తననవల "పణ్ లక్షాత్ కోణ్

ఘేతో''లో యామూ తల్లిలోను, "మీ" అనే నవలలో సుందరి తల్లిలోను, "కర్మయోగ్"లో చంద్రశేఖర్ తల్లిలోను చిత్రించాడు.

తల్లిపోయిన తర్వాత హరి నాయనమ్మకు, పెత్తల్లి (పెత్తండ్రి భార్య)కు బాగా మాలిమి అయాడు. అల్లరి పిల్లవాడయాడు. ఒకసారి దీపావళి రోజులలో పోలీస్ కమీషనర్ ఆజ్ఞలకు వ్యతిరేకంగా బొంబాయి వీధుల్లో టపాకాయలు కాల్చినందుకు అతనిని పోలీసుల చేతులనుండి అతని పెత్తండ్రి కాపాడవలసివచ్చింది. అనుకరణ విద్యలో చాలా నేర్పుకలవాడు కావడంతో కూరగాయలు అమ్మే వాండ్లను, పాములు ఆడించేవాండ్లను మరి ఇతరులను ఎప్పుడూ అనుకరిస్తూ ఉండేవాడు.

హరి తండ్రి 1870 లో తిరిగి వివాహం చేసుకొన్నాడు. అతని సవతి తల్లి అతనియందు చాలా ప్రేమగా ఉండేది. అయితే నానా సాహెబ్ ఉద్యోగరీత్యా బదిలీ అవుతూ ఉండడంవల్ల వారిద్దరు ఒకేచోట ఉండడం చాలా అరుదుగా ఉండేది. హరి మొదట బొంబాయిలో పెత్తండ్రిగారి సంరక్షణలోను, తరువాత పూనాలో నాయనమ్మ, ఆమె విధవ ఆడపడుచు సంరక్షణలోను పెరిగాడు.

1871 లో అన్నా సాహెబ్ (మహదేవ్) న్యాయ శాస్త్రంలో ప్రథమ స్థానంలో పట్టా పుచ్చుకున్నాడు. ఇలా రెండవసారికూడ ఆయనకు అదృష్టం కలిసివచ్చినందుకు అందరూ సంతోషించారు. అన్నా సాహెబ్ కొద్దికాలం బొంబాయి ప్రభుత్వ న్యాయశాఖలో సబ్ జడ్జిగా పనిచేశాడు. కాని సుమారు 4 సంవత్సరాలకే ఆ ఉద్యోగానికి రాజీనామాయిచ్చి ఆయన బొంబాయి హైకోర్టులో న్యాయవాదిగా పనిచేయ నారంభించాడు. ఈ మధ్య కాలంలో ఆయన భార్య క్షయరోగంతో చనిపోయింది. హరి మరొక్కసారి

తల్లిలేని బిడ్డైనాడు. న్యాయవాదిగా అణ్ణాసాహెబ్ బాగానే సంపాదించాడు, కాని భార్యపోయిన తరువాత చాలా ఉదాసీనంగా ఉండ నారంభించాడు. అవిభక్త కుటుంబానికి సహాయం చేయడంలో ఆయనకుగల ఆసక్తి తగ్గిపోయింది. ఇంటివద్ద ఆయన ప్రవర్తనకూడ భరించరానిదయింది. ఒకసారి ఆయన తన విధవ తోబుట్టువుతో కటువుగా మాట్లాడడంవల్ల హరి తండ్రి తాను వేరే కుటుంబాన్ని ఏర్పాటుచేసుకోవలెనని నిశ్చయించాడు. మరుసటి రోజునే ఆయన బొంబాయిలోనే ఫణస్‌వాడీలో ఒక ఇల్లు కుదుర్చుకొని అక్కడికి మకాం మార్చాడు. బొంబాయిలో కుటుంబ ఖర్చులు ఎక్కువ కావడంవల్ల ఆయన కుటుంబాన్ని తిరిగి పూనాకు పంపవలసిన అవసరంకలిగింది. ఆ రోజులలో పూనాలో జీవితం బొంబాయిలో కంటె చవకగా ఉండేది.

పెత్తల్లి చనిపోకముందే ఆమె పట్టుదలవల్ల హరి ఉపనయనము పూనాలో 1872 లో జరిగింది. ఆ ఉత్సవము నాలుగు రోజులు బాగా ధన వ్యయముతో జరిగింది. ఆ ఉత్సవానికి ముందు జరిగే విందులో (దానిని మాతృ భోజనం అంటారు. అప్పుడు నూతన వటువు కాబోయే బాలుడు తల్లితోబాటు తల్లి విస్తట్లో చివరిసారిగా భోజనంచేస్తాడు), వారి పొరుగింటి ఆమె శ్రీమతి రాధాభాయి గోక్లే, పిల్లవాని చురుకుదనానికి ముచ్చటపడి, తన కుమార్తె మధును, అతడు ఎప్పుడు వివాహంచేసుకొంటే అప్పుడే, ఇస్తానని చెప్పింది. ఆమె భర్త విశ్వనాథ్ గోక్లే పూనాలో న్యాయవాది. ఆప్టేలకు పొరుగింటివారు. హరి ఆ రోజులలో పూనాలో చదువుకొంటూ ఉండేవాడు.

ఆరవ సంవత్సరంలో హరి తన పెత్తండ్రిగారింట్లో బొంబాయిలో ఉన్నప్పుడే అతని విద్యాభ్యాసం ఆరంభమయింది. చిన్నతనంనుంచి

అతనికి పుస్తకాలు చదవడంలో అభిరుచి కలిగింది. అతని పెత్తండ్రి గారింట్లో అతనికి పుస్తకాలు విరివిగా దొరికేవి. అతనికి ఇతర బాలురవలె ఆడుకోవడానికి ఇష్టం ఉండేదికాదు. పుస్తకాలు చదవడంలో అతనికున్న అభిలాషమూలంగా అతను అల్లరిపనుల జోలికి పోయేవాడుకాడు. అతడు త్వరలోనే బొంబాయిలోని మిషన్స్ హైస్కూలులో మూడు తరగతులు పూర్తిచేశాడు. కాని 1878 లో అతని కుటుంబము పూనా చేరడంతో హరి పూనాలోని గవర్నమెంటు హైస్కూలులో చేరాడు. ఆ పాఠశాల ప్రసిద్ధమైనది. అందు సమర్థులైన ఉపాధ్యాయులుండేవారు. అచట క్రమశిక్షణ బాగుండేది. విద్యా వాతావరణము ఉత్తమంగా ఉండేది. బొంబాయిలోని క్రైస్తవ పాఠశాలలో క్రైస్తవ మత సంబంధమైన వాతావరణము ఉండేది. కాని పూనా హైస్కూలులో మరాఠీ వాతావరణము, సంప్రదాయము ఉండేవి. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు కుంటే, ఉపాధ్యాయులు జీన్సీవాలే, ఛిప్లూణ్కర్ గొప్ప పండితులు. దేశభక్తులు, ఆదర్శవాదులు. పాండిత్యంలో, పరిపూర్ణతలో, సభ్యతలో అభిరుచులలో వీరు ఎల్లప్పుడూ విద్యార్థులకు మార్గదర్శకులుగా ఉండేవారు. కాని వీరందరిలో ఛిప్లూణ్కర్ గారి ప్రభావమే హరిమీద ఎక్కువగా పనిచేసింది. ఈయన మహారాష్ట్రంలో విద్యా, పాండిత్యాలలో నూతనశకాన్ని ఆరంభించాడు. ఈయన పత్రికా రచనా వ్యాసంగము జాతీయ ధర్మాలతో కూడుకొని ఉన్నది. ఆయన రచనలు 19వ శతాబ్దం చివరి మూడు దశాబ్దాలలో బ్రిటిషువారి కృత్రిమ ప్రచారాన్ని, వివేక వినాశన ప్రయత్నాన్ని ఎదుర్కొనేవి. పాఠశాలలో హరికి తటస్థించిన ముఖ్య స్నేహితులలో కొందరు సఖారామ్ పాన్సే, కృష్ణవాబ్లే, నరహరి కెజరికర్, శివరామ్‌సాఠే, ఆత్మారామ్ దేశ్‌ముఖ్, గంగా

ధర్ మహాజని, వైజ్‌నాథ్ కాశీనాథ్ రాజ్‌వాడే, అత్రే, ఢేక్‌ణే, పరాంజపే, కర్వే మొదలయినవారు. వీరిలో చాలామంది తరువాత రోజులలో మహారాష్ట్ర ప్రజాజీవితంలో వేరువేరు రంగాలలో పాల్గొన్నారు.

హరి తండ్రి 1880 లో సతారాకు బదిలీ అయినాడు. అప్పటి నుండి కొన్ని సంవత్సరాలవరకూ పూనాలో ఉంటున్న ఆప్టే కుటుంబంలో మగవారిలో హరియే పెద్దవాడు. అక్కడ అతనికి అదుపు ఆజ్ఞలు లేకపోయినవి. ఆ రోజులలో స్త్రీలు మగవారిని ఎంతవరకు అదుపులో ఉంచగలరు? అంతేకాక అతనికి అందరివద్ద గారాబం కూడా. అతనికి ఇంకా చిన్నతనపు అల్లరి వదలలేదు. ప్రతి దినము సంస్కృత పండితుని బట్టతలను ఒకసారి నిమురనిస్తేనే తప్ప హరి ఆయనవద్ద సంస్కృత పాఠాలను చదివేవాడు కాదు. రఘువంశము, శాకుంతలము, విక్రమోర్వశీయము మొదలైన సంస్కృత గ్రంథాలు చదివి, సంస్కృత గ్రంథాలను స్వయంగా అర్థం చేసుకొనే జ్ఞానాన్ని హరి సంపాదించాడు. ఆ విధంగా అతను సంస్కృతంలోనూ, మరాఠీలోను ఇతరులకన్న అధిక్యతను సంపాదించాడు. ఇంగ్లీషు బాగానే చదివేవాడు గాని దానిమీద అతనికి అశ్రద్ధ ఎక్కువ. లెక్కలు పూర్తిగా అశ్రద్ధ చేసేవాడు. దస్తూరి విషయంలో కూడా ఏమాత్రం శ్రద్ధ వహించలేదు. అందువల్ల తరగతిలో ప్రథమ స్థానాన్ని అతను ఎప్పుడూ సంపాదించలేదు. ఈ కారణం చేతనే బహుశః అతనిలో అభ్యుదయ వాంఛ పూర్తిగా తగ్గిపోయింది.

కాని హరిలో పఠనశీలనశక్తి బాగా ఉన్నది. బాల్యంలోనే చిన్న కథలు, పద్యాలు వ్రాయడం ప్రారంభించాడు. అతని కథలలో "పూరీ హౌస్ ఫిటలీ" (ఉత్సాహం పూర్తిగా మందగించింది)

అనే కథను అతను ఐదవ ఇంగ్లీషు తరగతిలో ఉండగా వ్రాశాడు. అతను "నాట్య కథార్ణవ" అనే మాసపత్రికను చదువుతూ ఉండే వాడు. అది అతనిలో ఊహాశక్తిని ప్రేరేపించింది. మెడోస్ టేలర్ వ్రాసిన "పాండురంగ్ హరి" అనే గ్రంథాన్ని "అనాథ్ పాండురంగ్" అనే పేరుతోను, మరొక గ్రంథం "తారా" అనేదాన్ని అనువాదం చేశాడు. కాని ఆ రెండు అనువాదాలు ఇప్పుడు లభ్యం కావడం లేదు.

విష్ణుశాస్త్రి ఛిప్‌లూణ్‌కర్ తన "న్యూ ఇంగ్లీషు స్కూలు"ను 1880 జనవరి 1 వ తేదీన స్థాపించాడు. తరువాత ఆయనతో తిలక్, కరందీకర్, భగకల్ చేరారు. వీరు ముగ్గురు డక్కన్ కాలేజీ పట్టభద్రులు. వీరి ఈ ప్రయత్నం, యుక్తం వారికి జాతీయ భావ ప్రేరితమైన విద్యను బోధించవలెననే వాంఛా పర్యవసానమే. యువతరం వారిని ప్రోత్సాహపరచే ఆత్మ గౌరవము, ప్రభుత్వ పాఠశాలలో గరపబడే విద్యలో లోపించింది. ఆ ప్రభుత్వపాఠశాల లోని ఉన్నత తరగతి విద్యార్థులలో చాలామంది విష్ణుశాస్త్రిగారిని, ఆయనగారి అననుకరణీయమైన ఉత్సాహక పూర్వమైన బోధనాపద్ధతులను బాగా ఎరిగి ఉన్నారు. హరి, మరికొందరు ఉత్సాహవంతులైన విద్యార్థులతో కలిసి ఈ కొత్త పాఠశాలలో చేరాడు. వారి కంటే చిన్నవారిలో చాలామంది వారిని అనుకరించారు. ఈ కొత్త పాఠశాలలో మొదటి దినమున చేరిన బాలుర సంఖ్య నూటయాభై. మాధవ్‌రావ్ నామ్‌జోషీ, వాసుదేవశాస్త్రి ఖరే (ఆ తరువాత పేరు మహారాష్ట్ర చరిత్ర పరిశోధకులయినారు), హరికృష్ణదామ్లే (ఇంగ్లీషు భాషాబోధనలో ప్రసిద్ధులు), నన్‌దర్గీకర్ శాస్త్రి (ప్రసిద్ధ సంస్కృత పండితుడు, పత్రికా సంపాదకుడు)వంటి ప్రఖ్యాత ఉపా

ధ్యాయులు ఈ పాఠశాలలో ప్రారంభంనుంచీ చాలా తక్కువ జీతాల మీద పనిచేశారు. ఆ సంవత్సరం ఆగస్టు నెలలో ప్రఖ్యాత సంస్కృత పండితుడు వామన్ శివరామ్ ఆప్టే పాఠశాలలో చేరారు. ఆ పాఠశాల మంచి స్థితిలో ఆరంభమై, తరువాత చాలాకాలం వరకూ జాతీయ విద్యా కేంద్రముగా నిలిచిపోయింది. మూడు మాసాలలో ఆ పాఠశాల విద్యార్థుల సంఖ్య మూడు వందలయింది. ఆ రోజులలోనే హరి "బ్రిటిషు ప్రభుత్వ సేవచేయను" అనే ప్రతిన తీసుకొన్నాడు. ఆ పాఠశాల వాతావరణము పూర్తిగా స్వాతంత్ర్యము, పాండిత్యము వీటితో నిండి పోయింది. మెట్రిక్యులేషన్ తరగతిలోకి వచ్చే సరికే హరి మిల్టన్, షేక్స్పియర్, స్కాట్, షెల్లీ, కీట్సు, జేన్ ఆస్టిన్, డికెన్సు, థాకరే గ్రంథాలను, ఇంగ్లీషులోనికి అనువదించబడిన మొలియర్ నాటకాలను చదివి, అర్థం చేసుకోగల జ్ఞానాన్ని సంపాదించాడు.

"నూతన ఇంగ్లీషు పాఠశాల" సంస్థాపకుడు విష్ణుశాస్త్రి దురదృష్ట వశాత్తు 1882 మార్చి 17వ తేదీన చనిపోయాడు. పండితుడు, దేశభక్తుడు అయిన విష్ణుశాస్త్రి మరణం హరిని దుఃఖసముద్రంలో ముంచింది. శవం వెంట స్మశానం వరకూ వెళ్ళివచ్చిన హరి ఆ దృశ్యాన్ని చూచి ఉత్తేజితుడై "శిష్య జనవిలాపము" అనే పేరుతో ఛిప్లూణ్కర్ మీద 89 పద్యాలతో ఒక విషాదగీతమాల రచించాడు. ఆ గీతము అచ్చు అయిన రెండు రోజులలోనే వెయ్యి ప్రతులు అమ్ముడు పోయినవి. ఆ దేశభక్తుని మరణానికి సంతాపము తెలుపడానికి ఆ పాఠశాలలో జరిగిన సంతాప సభలో ఈ పద్యాలు చదువబడినవి. ప్రథమముద్రణ ప్రతులన్నీ ఒక వారంలోనే అమ్ముడు పోయినవి. ఈ చిన్ని గ్రంథ రచనతో హరికి ప్రఖ్యాతి వచ్చింది.

కొద్ది కాలానికే ఆ పాఠశాలోపాధ్యాయులు అగర్కర్, తిలక్ అను వారిద్దరికి - వారు "కేసరి" "మరాఠా" పత్రికల సంపాదకులు కూడాను - ఒక ఆపద వచ్చిపడింది. "కొల్హాపూర్ దివాన్ బార్వే" అనే అభియోగంలో వారిద్దరికీ 1882 జూలై 17 న నాలుగు మాసాలు కఠిన వరకము విధించబడింది. దేశభక్తులైన ఈ ప్రతివాదుల న్యాయస్థానపు ఖర్చులకోసం సేకరించబడిన నిధికొరకు హరి, తన స్నేహితులతో కలిసి బ్రహ్మాండమైన కృషి చేసి, ఆ న్యాయాన్ని నిరంతరము ఎదుర్కొనే ఈ ఇరువురు ప్రసిద్ధ వ్యక్తులందు తనకుగల గౌరవాన్ని ప్రదర్శించాడు. కాని వీటన్నింటివల్ల అతని చదువుకు భంగం కలిగింది. ఆ సంవత్సరము అతనిని బొంబాయి మెట్రిక్యు లేషన్ పరీక్షకు పంపలేదు. కాని మరుసటి సంవత్సరము 1883లో అతను మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థుడైనాడు.

హరి స్కూల్లో ఉండగానే; షేక్స్పియరు, కాళిదాసు, భవభూతి అనే కవుల్ని పోలుస్తూ అగార్కర్ వ్రాసిన తులనాత్మక పరిశీలనము చూచి, తానొక వ్యాసం వ్రాశాడు. ఈ తులనాత్మక పరిశీలనలో అగార్కర్ దృష్టిలో కాళిదాసు పై కవులలో చివరి వాడు. ఈ అభిప్రాయంతో ఏకీభవించని హరి, కాళిదాసు శైలిని భవభూతి కృతక శైలితో పోల్చి, కాళిదాసు ఘనతను స్థాపించాడు. కాళిదాసు ప్రేమను వర్ణించిన పద్ధతిలో ఉన్న విశిష్టతను సుస్పష్టం చేశాడు. తన అభిప్రాయాలను బలపర్చుకోవడానికి, హరి మూల గ్రంథాలలోనుంచి ఎన్నో ఉదాహరణలు చూపించాడు.

ఈ రోజులలోనే హరి లాంగ్ ఫెలో వ్రాసిన "జీవితగీతము" అనే ఆంగ్ల భాషాగీతాన్ని అనువదించాడు. తరువాత కాలంలో ప్రభుత్వం వారి పాఠ్యపుస్తకాలలో ఈ అను వాదానికి స్థానం లభిం

చింది. అప్పటికే హరి సంస్కృతంనుంచికూడా బాగా అనువాదం చేయగలిగి ఉన్నాడు.

ఒక సంవత్సరం తరువాత హరి అగర్కర్ వ్రాసిన "వికార్ విలసిత" (షేక్స్పియర్ వ్రాసిన Hamlet నాటకానువాదము) మీద 72 పేజీల విమర్శనా వ్యాసాన్ని 1882లో వ్రాశాడు. ఆ వ్యాసము చాలా ప్రసిద్ధి పొందింది. హృదయ వైశాల్యంగల అగర్కర్, హరి వ్రాసిన విమర్శనను సుహృద్భావంతో స్వీకరించాడు. తన శిష్యుడే విమర్శ వ్రాసినందుకు ఆయన చాలా గర్వించాడు.

హరి నాయనమ్మ, ఆమె పెద్ద కుమార్తె మనూతాయీ భర్తృవిహీన అయిన దగ్గరనుంచి చాలా దుఃఖిస్తూ ఉండేది. దానికితోడు ఆమె కుమారుడు అన్నాసాహెబ్ (హరి పెత్తండ్రి) మొండితనము, విపరీత ప్రవర్తన ఆమె దుఃఖాన్ని ఇనుమడింపజేసినవి. ఆమె తన కాలాన్ని ప్రార్థనలోనూ, మతవిషయకమైన పూజలలోనూ గడపసాగింది. అందరు మనుమలు, మనుమరాళ్లలో ఆమెకు హరి అంటే ఎక్కువ అభిమానం. అతని కిష్టమయిన పిండి వంటలు అతడి కొరకు దాచిపెడుతూ ఉండేది. అతనుకూడ ఆమెను అలాగే అభిమానించేవాడు. ఆమెతో మాట్లాడడంగాని, ఆమె చెప్పిన ఒకటి రెండు కథలు వినడంగాని ఒక్కరోజునకూడా మానేవాడు కాడు. ఆమె ఆడబిడ్డ (హరితండ్రికి మేనత్త) కుటుంబ సంరక్షణ శ్రద్ధతోను, జాగ్రత్తతోను నిర్వహిస్తూ ఉండేది. ఇంచుమించుగా ఆమె గృహంలో సర్వాధికారి.

అప్పటికి హరి వయస్సు పదహారు సంవత్సరాలు. ఆనాటి ఆచారాన్నిబట్టి అతనికి వివాహవయస్సు వచ్చింది. ఆదివరకే పొరుగున ఉన్న శ్రీదామోదర్పంత్ గోక్లే కుమార్తె మధును అతని కిచ్చి

వివాహం చేయడానికి నిర్ణయం జరిగింది. 1879 మే 16వ తేదీ వివాహానికి లగ్నం నిశ్చయ పరిచారు.

వరకట్నం తీసికోవడం ఆనాటి ఆచారమైనప్పటికీ, హరి నాయనమ్మగారి ఆజ్ఞానుసారం పెండ్లికుమారుడికి వరకట్నం ఏమీ లేదు. అయినా గోఖలే కుటుంబమువారు వచ్చిన బంధువుల నందరినీ బహుమానపూర్వకంగా సత్కరించారు. వివాహం చాలా ఆడంబరంగా జరిగింది. అప్పటినుండి హరిని అందరూ "తాత్యా" అని పిలవనారంభించారు.

నూతన గృహంలో నూతన వధువు మధుకు అత్యంతాదరము లభించింది. తనతల్లి తండ్రులకు ఆమె మిక్కిలి గారాబు బిడ్డ. ఆమె సాయంకాలం పుట్టింటికి వెళ్లి ఉదయము తిరిగి అత్తింటికి వస్తూ ఉండేది. మొదటి అయిదు సంవత్సరాలు కొద్ది మినహాయింపులతో ఈ విధంగా జరిగింది. వివాహం జరిగిన మొదటి సంవత్సరమంతా ఆ రెండు గృహాలలోనూ ఎడతెగకుండా విందులు జరిగేవి. తరువాత మధుకు అత్తింటిలో కొద్దిపాటి గృహ కృత్యాలభారం వప్పగించబడింది. అటువంటి పని ఆమెకు అలవాటులేదు. ఆపని నేర్చుకోవడానికి ఆమెకు కొంతకాలము పట్టింది. అందువల్ల కుటుంబములోని ఇతర కోడళ్ల చురుకుతనంతో పోలిస్తే ఆమె వెనుకబడింది. కాని ఆమె లోపాలను అందరూ క్షమించేవారు.

ఈ సమయంలో హరి ఆలోచనలు ఏలా ఉన్నవో మనము ఇప్పుడు ఆలోచించాలి. నూతన వధువు చదువను, వ్రాయను నేర్చుకోవలెనని అతని అభిప్రాయం. ఇంతవరకు ఆమెకు అక్షర జ్ఞానములేదు. భారతదేశము సాంస్కృతికంగా అభివృద్ధి చెందవలెనంటే స్త్రీలు నిరక్షరాస్యులుగా ఉండడానికి వీలులేదని హరి దృఢ విశ్వాసము. ఈ

నూతన విద్యావిధానము భారతదేశంలో ప్రవేశించక పూర్వము భారత స్త్రీలు నిజంగా అవిద్యావంతులు కారు. విద్యా పద్ధతులు, ఆ విద్యకు ఆదర్శాలు మాత్రం వేరు. వారికి తమ విధులు పూర్తిగా తెలుసు. ఉత్తమ గృహిణులు వారు. వారిమాట, ప్రవర్తన మృదువు, సరళం అయినవి. వారు ఉత్తమ సంస్కృతి కలవారు. ఆధునిక విజ్ఞాన శాస్త్రము, చరిత్ర, భూగోళము వారికి తెలియకపోవచ్చు. ఈ విషయాన్ని ఋజువు చేయడానికి చరిత్రనుంచి ఉదాహరణ లీయ నవసరంలేదు. కాని విద్యావంతులైన యువకులు మిల్ వ్రాసిన "స్త్రీలను అణగ ద్రొక్కడం" (Subjection of Women) అనే గ్రంథం వంటి గ్రంథాలు చదివిన కారణంచేత వారికి స్త్రీలు ఆధునిక పద్ధతులలో విద్యావంతులు చేయవలెనని, వారి విధుల బాధ్యతలను వారికి తెలియజేయవలెనని కోరిక, ఉత్సాహం కలగాయి. మిల్ యొక్క భావాలంటే హరికి చాలా ఇష్టం. కళాశాలలో హరి స్నేహితుడి సోదరి శ్రీమతి కాశీతాయీ కనిట్కర్ అనే ఆమె తన గృహ కృత్యాలు నిర్వహించుకుంటూనే స్వసహాయంతో, పూర్వాచార పరాయణులైన స్త్రీల ప్రతిఘటనల నెదుర్కొని ఆంగ్లము, మరాఠీలను చదవడం అతనికి బాగా తెలుసు. ఆమె సామర్థ్యానికి అతను చాలా గర్వపడ్డాడు. తన భార్య ఈ సంఘటనను ఉదాహరణగా గ్రహించవలెననే కోరికతో హరి ఆమెకు విద్యాబోధన చేయడం ప్రారంభించాడు. కాని ఆమె అంత ఉత్సాహం చూపలేదు. ఇంట్లో ఉన్న ఇతర స్త్రీలందరూ పూర్వాచార దృక్పథం కలవారు. వారి దృష్టిలో స్త్రీకి ఆంగ్ల విద్య - అసలు ఏ విద్య అయినా సరే - అనవసరము. అది ప్రవర్తన లోపానికి దారి తీస్తుంది. గృహకృత్యాలు సమర్థవంతంగా నిర్వహించడం, బిడ్డల పెంపకంలో తమ విధిని నెరవేర్చడం, పుస్తకం విజ్ఞానంకన్న

స్త్రీలకు చాలముఖ్యమని వారి అభిప్రాయము. హరి భార్యకు ఆటు తంతో దినమంతా కాలక్షేపం చేయవలసిన స్త్రీలను సంతోష పరచడం కష్టమయింది, ఇటు తన భర్తయొక్క ఉత్సాహ పూరితమైన కోర్కెను నెరవేర్చడం కష్టమయింది. హరి కాలేజీలోనే నివాసముంటూ తాను శని, ఆదివారాలలో ఇంటికి వచ్చినప్పుడు మధుకు చదువు చెప్పవలెననే ప్రయత్నాలు ఎక్కువగా ఫలవంతంకాలేదు. చెప్పుకొన్న పాఠాలను తిరిగి చదవడానికి ఆమెకు అవకాశం లేక పోవడంతో శనివారం వచ్చేసరికి లోగడ చదివినది ఆమె మరిచి పోయేది. హరి తన భార్యను శ్రీమతి కాశీతాయీ కనిట్కర్‌కు పరిచయంచేసి ఆమెను వీలైనన్ని సార్లు కలుసుకోవలసిందని మధుకు చెప్పాడు. ఆపనికూడా ఆమె చేయలేక పోయింది. పెద్దలైన స్త్రీల మనస్సులకు కష్టం కలిగించకుండా, పూర్వ కాలపు కట్టుబాట్లనుంచి తప్పించుకొని ఆమెవద్దకు వెళ్ళడానికి మధుకు వీలే కలుగలేదు. ఇదంతా కొత్త పెండ్లికూతురి అసంతృప్తికీ, మనః క్లేశానికీ, కలవరపాటుకూ కారణమయింది. హరికూడా చాలా కలవరపడ్డాడు కాని. పరిస్థితిని మెరుగు పరచడానికి అతనేమీ చేయలేక పోయాడు.

1883 లో "నూతన ఆంగ్ల పాఠశాల"ను వదలి హరి "పూనాడక్కన్ కాలేజీ"లో చేరాడు. డక్కన్ కాలేజీ ప్రసిద్ధి చెందిన విద్యాస్థానము. ఆ రోజులలోనే దానికి బ్రహ్మాండమైన భవనము, ఉత్తమమైన ఆంగ్ల భాషోపన్యాసకులు, చక్కని గ్రంథాలయం, అందమైన వసతి గృహము. విశాలమైన క్రీడాస్థలము, ఈతకు, గుర్రపు స్వారీకితగిన సౌకర్యాలు ఉన్నాయి. పాఠ్య గ్రంథాలేకాక హరి ఇక్కడ ఇతరమైన గ్రంథాలుకూడా చదివాడు. జె. యస్. మిల్, హెర్బర్ట్ స్పెన్సర్‌ల గ్రంథాలు అతనిని ఎక్కువగా ఆకర్షిం

చాయి. ఇతర గ్రంథకర్తలలో అతను బేకన్, బర్క్, స్కాట్, జాన్సన్, మెకాలే, జేన్ ఆస్టిన్‌ల గ్రంథాలు చదివాడు. థాకరీ. డికెన్స్, స్కాట్, ఆస్టిన్‌ల నవలలు ఇంచుమించు అన్నీ చదివాడు. 1920 సంవత్సరం వరకు రైనాల్డ్స్ అనే గ్రంథకర్త (ఆంగ్ల సాహిత్య చరిత్రలో ఈయన పేరే కనపడదు) గ్రంథాలు మహారాష్ట్రంలోని పాఠకులలో విరివిగా ప్రచారంలో ఉన్నాయి. ఆయన వ్రాసిన "లండన్ అంతఃపుర రహస్యాలు" (Mysteries of the Court of London), "సైనికుని భార్య" (The Soldier's Wife) మొదలైన గ్రంథాలను చాలామంది చదివేవారు. హరి అవికూడా చదివాడు. అతను షేక్స్పియర్ గ్రంథాలుకూడా చదివాడు. కళాశాలలో చేరిన మొదటి సంవత్సరంలోనే "రోమియో-జూలియట్" (Romeo and Juliet) అనే గ్రంథంపైన "నిబంధ చంద్రిక"లో ఒక వ్యాసము వ్రాశాడు. రాజకీయాలు, మతము, వేదాంతము-వీటికి సంబంధించిన గ్రంథాలు కూడా అతను అడపాదడపా చదివాడు. హాలామ్ వ్రాసిన "బ్రిటిషు రాజ్యాంగ చరిత్ర" (History of the British Constitution) అంటేకూడ అతనికి ఇష్టము. కళాశాలలోని అధ్యాపకులు ఆక్సన్‌హామ్, సెల్బీ, ఫారెస్ట్, ఆర్. జి. బారెట్, యస్. ఆర్. భాన్‌డార్కర్, శాస్త్రీ వామనాచార్య ఝల్కీకర్ మొదలయిన వారందరూ నక్షత్ర మండలంలోని నక్షత్రాలవలె ప్రకాశించేవారు. వి. క. రాజ్‌వాడే (తరువాత ఇంగ్లీషు భాషలో ఆచార్యపదవి నలంకరించినవాడు) అప్పుడు కాలేజీలో దక్షిణ ఉపకారవేతనం పొందినవాడు. ఆ కళాశాలలోని విద్యార్థులకు, ఇదివరలో భారత దేశములో ఏ కళాశాల విద్యార్థులకును లేని స్వాతంత్ర్యమున్నది. తల్లిదండ్రుల నిర్బంధముగాని, మత సంబంధమైన ఆటంకముగాని

లేకుండా, ఇష్టానుసారం చదవడానికి, తోచిన పనిచేయడానికీ, తమ వయస్సు వారితో కలిసి మెలిసి తిరగడానికి, ఆడడానికి, మాట్లాడడానికి వీలుగా వారు తమ స్వగృహాలకు దూరంగా ఉంటున్నారు. ఈ స్వాతంత్ర్యము సాధారణంగా చాలా సద్గుణాలకు కారణమవుతుంది. కాని కొందరికి ఆ విధమైన ఉపయోగాలు కలగక పోవచ్చు. హరి ఈ స్వతంత్ర వాతావరణంలోకి మనఃపూర్తిగా ప్రవేశించాడు. కళాశాలలో జరిగే వివాద సభలు (Debates) లో పాల్గొనేవాడు. కాని గ్రంధాలయంలో కూర్చొని చదవడమే అతని ప్రధాన కార్యకలాపము. విద్యార్థుల గ్రంధాలయము ఉన్నది గాని అందులో మరాఠీ సాహిత్య గ్రంధాలు లేవు. పూర్తిగా హరి ప్రయత్నంవల్లను, అధికారులకు అతను నచ్చచెప్పడంవల్లను ఆ గ్రంధాలయంలోకి మరాఠీ సాహిత్య గ్రంధాలు వచ్చినయి. కళాశాలలో అతనికి చాలామంది మంచి స్నేహితులు దొరికారు. హరి హాస్యయుతంగా మాట్లాడేవాడు. అందువల్ల అందరూ అతని సహచర్యాన్ని ఆశించేవారు. సమర్ధ్, పాన్‌సే అనే అతని స్నేహితులతో కలిసి హరి గోల్డ్‌స్మిత్ వ్రాసిన "She Stoops to Conquer" అనే నాటకంలో పాత్రధారిగా ఉండి, "టానీ లంప్‌కిన్" (Tony Lumpkin) అనే పాత్రధరించాడు. స్వదేశీ ఆటలలో అతనికి అంత అభిరుచిలేదు. టెన్నిస్ బాగా ఆడేవాడు. పడవషికారు చాలా ఇష్టముకాని పడవను నడపడానికి అతను ఎప్పుడూ తెడ్డువేసేవాడుకాడు. ఆ సంవత్సరాంతమున ప్రథమ పరీక్షకు కూర్చొన్నాడుకాని "గణితము"లో తప్పిపోయాడు. ఆ కారణంచేత విశ్వ విద్యాలయపు పరీక్షకు కూర్చోవడానికి అతనికి వీలుకాలేదు. అప్పుడు హరికి ఒక సమస్య ఎదురయింది. అతను వెనుకబడినాడు. అతని సహాధ్యాయులు ముందుకు వెళ్లారు. ఆ

కారణంచేత అతను కొత్తగా తెరువబడిన ఫెర్గూసన్ కాలేజీలో చేరడానికి నిశ్చయించుకొన్నాడు. వామన్ శివరామ్ ఆప్టే (గొప్ప సంస్కృత పండితులు) జి. జి. అగర్కర్, వి. బి, శెక్కర్, బి. జీ. తిలక్ (తరువాత 'లోకమాన్య' అని ప్రసిద్ధిచెందినవారు) అనే అధ్యాపకులు అక్కడ సంస్కృతము, చరిత్ర, ఆంగ్లము, గణితము వరుసగా బోధించేవారు. ఆచార్య కేల్కర్ గారి ఆంగ్ల భాషాబోధన హరిని ఎక్కువగా ఆకర్షించింది. తరువాత వారిద్దరు జీవితాంతము స్నేహితులై తరుచు సాహిత్యాన్నిగురించి చర్చిస్తూ ఉండేవారు.

ఆ రోజులలో యువకులు "రేనాల్డ్స్" వ్రాసిన నవలలు ఎక్కువగా చదివేవారని, హరి డక్కన్ కళాశాలలో ఉండగానే "లండన్ అంతఃపుర రహస్యాలు" అనే గ్రంధాన్ని చదివాడని ఇదివరకే చెప్పినాము. ఆ గ్రంథంలోని మొదటి రెండు అధ్యాయాలను హరి అనువాదం చేశాడు. హరి స్నేహితులు ఆ ప్రయత్నాన్ని హర్షించారు. వైద్య దానిని "పూనా వైభవ్" అనే పత్రికా సంపాదకుడివద్దకు తీసికొని వెళ్లాడు. ఆయన దానిని వెంటనే తన పత్రికకు అనుబంధంగా "మధలీస్థితి" (The Interlude) అనే పేరుతో ప్రకటించాడు. ఈ ప్రచురణ పాఠకులలో ఉద్రేకోత్సాహాలను కలిగించింది. రావ్ బహదూర్ వి. యమ్. మహాజని, రావ్ బహదూర్ కే. యన్. సానే అనే ప్రసిద్ధ గ్రంథకర్తలు పేరు ప్రకటింపబడని ఈ గ్రంథకర్తను అభినందిస్తూ పత్రికా సంపాదకునికి లేఖలు వ్రాశారు. "నాట్యకథార్ణవ్" సంపాదకుడుకూడా అభినందిస్తూ, తాను తరువాతి అధ్యాయాలను చదవడానికి మిక్కిలి ఆతురతతో వేచి ఉన్నానని వ్రాశాడు. అదే సంచికలో అనగా "మధలీస్థితి" ప్రకటింపబడిన సంచికలోనే "విక్టోరియా యుగపు

నవలయొక్క ఆదర్శం" అనే విషయముమీద అనగా "సంఘాన్ని వాస్తవికంగా చిత్రించడంద్వారా సాంఘికాభ్యుదయానికి అవసరమయిన సలహా ఇవ్వడం, వినోదాన్ని కలిగించడం" అనే విషయాన్ని గురించి హరి ఒక వ్యాసము వ్రాశాడు. హరి వ్రాసిన నవల, దానిని ప్రకటిస్తున్న పత్రిక అవలంబించే పూర్వాచార దృక్పథానికి పూర్తిగా భిన్నంగా ఉన్నది. కాని ప్రజాభిప్రాయం మాత్రం ఆ ప్రచురణకు పూర్తిగా అనుకూలంగా ఉండడంచేత ఆ నవల ఆ పత్రికలో నిరభ్యంతరంగా ప్రకటించబడింది. మరొక విధంగాకూడా అది సంపాదకుడికి సంతోషాన్ని కలిగించింది. అందులోని కొన్ని పాత్రలు, లాయరు, డాక్టరు, జమిందారు, దుబారాగా ఖర్చుచేసే ఒక వడ్డీ వ్యాపారస్థుని కుమారుడు, ఇంకా అనేక పాత్రలు పూనాలోనే ఆయన చుట్టుపట్ల సజీవంగా ఉన్నవాళ్లను చిత్రిస్తున్నవి. పాఠకలోకాన్ని ఈ నవల పూర్తిగా అలరించింది. మహారాష్ట్రమంతటా, అందరూ దానినిగురించే చెప్పకోనారంభించారు. ఆనాటి మహారాష్ట్ర సంఘంలోని వివిధ అంతస్థులలో ఉన్న వ్యక్తులను చాలా అందంగాను, తెలివి తేటలతోనూ ఆ నవలలో చిత్రించడం జరిగింది. ఆ చిత్రీకరణ చాలా స్వాభావికంగానూ, జీవితాన్ని అనుకరిస్తూనూ ఉన్నది. వ్యభిచారియైన ఒక స్త్రీ గృహం చాలా బాగా వర్ణించబడింది. అది చదివి పూనాలో ప్రసిద్ధికెక్కిన ఒక వ్యభిచార స్త్రీ కూడా మోసపోయింది. ఫానీబర్నే (Fanny Burne,) తండ్రికి ఆమె ఎవలీన్ (Eveline) అనే గ్రంథం వ్రాసిందని, చార్లెట్ బ్రాంటీ (Charlotte Bronte) తండ్రికి ఆమె జేన్ ఐర్ (Jane Eyre) అనే నవల వ్రాసిందనిగాని తెలియనట్లే, హరి ఈ గ్రంథం వ్రాశాడని అతని కుటుంబము వారికెవరికీ చాలాకాలం

వరకూ తెలియదు. ఈ గ్రంథ ప్రచురణవల్ల హరికి పేరు ప్రతిష్ఠలు వచ్చినవి కాని చదువులో అతని శ్రద్ధ చాలా తగ్గిపోయింది. అందుచేత అతను మొదటి సంవత్సరం పరీక్షలో తిరిగి "గణితము"లోనే తప్పిపోయినాడు. ఇది అతని పెత్తండ్రికి చాలా ఆశాభంగము కలిగించడంచేత ఆయన హరిని తిరిగి డక్కన్ కళాశాలలో చేరవలసిందని ఇంచుమించుగా ఆజ్ఞాపించాడు. అక్కడ అతను ప్రథమ సంవత్సరపు పరీక్షలో కృతార్థుడైనాడు. విశ్వ విద్యాలయ పరీక్షకు కూర్చొన్నాడు. ఆ పరీక్షలో సంస్కృతము, ఆంగ్లము తదితర విషయాలు బాగానే వ్రాశాడు, కాని అప్పుడుకూడా "గణితము"లోనే తప్పిపోయినాడు. ఆ తరువాత రెండు పర్యాయాలు ప్రైవేటు విద్యార్థిగా విశ్వ విద్యాలయపు పరీక్షలకు కూర్చున్నాడు, కాని పరీక్షలో నెగ్గలేదు. చివరకు 1886 లో కళాశాల వదలడానికి, విశ్వ విద్యాలయపు చదువుకు స్వస్తి చెప్పడానికి అతను నిశ్చయించుకొన్నాడు. అది అతని పెత్తండ్రికి చాలా కష్టం కలిగించింది. తన తమ్ముడి కుమారుని (హరి) సాహిత్య వ్యాసంగమంటే మిక్కిలి ఆదరముగల రావ్ బహాదుర్ కానిట్కర్‌తో ఆయన మాట్లాడాడు. బి.ఎ., యల్.యల్.బి. పరీక్షలు రెండూ పూర్తిచేసి తనతోబాటు బొంబాయి హైకోర్టులో ప్లీడరుగిరీ చేసేటట్లు హరిని ప్రోత్సహించవలసినదిగా ఆయన కానిట్కర్ గారిని కోరాడు. ఆ విధంగా జరిగినట్లయితే హరి కుటుంబపు భవిష్యత్తును గురించిన ఆదుర్దా ఆయనకు తగ్గేది. కాని ఆ విధంగా జరుగలేదు. చివరకు నిరాశతో 1886 లో హరి కళాశాల విద్యకు స్వస్తిచెప్పాడు.

1883 లో హరికి కానిట్కర్‌తో తన పెత్తండ్రిగారింట్లోనే పరిచయమైంది. అప్పుడు ఆయన బొంబాయిలో ప్లీడరుగా పని

చేస్తున్నారు. ఆయన హరికంటె పన్నెండు సంవత్సరాలు పెద్ద. అయినా పారస్పరతాభిరుచులలో ఉండే ఏకభావము వారిరువురినీ సన్నిహితులను చేసింది. వారిరువురి మధ్య స్నేహము బాగా నెల కొన్నది. ఆ తరువాత కానిట్కర్ సబ్ జడ్జిగా నియమింపబడి బొంబాయివదలి వెళ్లాడు. కాని వారిస్నేహము 1917 వరకు కొన సాగింది. ఆగర్కర్ వ్రాసిన హామ్లెట్ (Hamlet) మరాఠీ అను వాదాన్ని, అది ఇంకా పూనా ఆర్యభూషన్ ప్రెస్‌లో అచ్చు అవుతూ ఉండగానే వారిరువురు చదవడం తటస్థించింది. అంతకన్న ఉత్తమమైన అనువాదాన్ని చేయవచ్చునని హరి అనుకున్నాడు. అటువంటి అనువాదాన్ని కానిట్కర్ ఒక నెల రోజులలో పూర్తి చేయవలెనని, దానిని అదేమాదిరి ఆకారము, టైపులో, అంతకన్న మంచి కాగితముమీద ముద్రించవలెనని ఆ స్నేహితులిరువురు నిశ్చ యించారు. తరువాత హరి తాను వ్రాసిన "గన్పత్ రావ్" అనే నవలలో విష్ణుపంత్, లక్ష్మీబాయి పాత్రల చిత్రీకరణలో కానిట్కర్ దంపతులనే ఆదర్శంగా తీసుకొన్నాడు.

శ్రీమతి కానిట్కర్ "రంగ్ రావ్" అనే నవలను వ్రాయడం ఆరంభించింది. హరి వ్రాస్తున్న "మథలీస్థితి" చదివిన తరవాత, తన పుస్తకము, హరి పుస్తకముతో పోటీచేయలేదని, దానియొక్క సాహిత్యస్థానాన్ని అందుకోలేదని అనుకొని ఆమె చాలా నిరుత్సాహ పడింది. హరికి ఈ విషయం తెలిసి, పుస్తము వ్రాయడం పూర్తి చేయవలసిందని, ప్రోత్సాహపరుస్తూ ఆమెకు ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలో హరి ఆమెను ఆమెశక్తి సామర్థ్యాలను మించి భూషించాడు. కాన ఆ ఉత్తరంవల్ల ధైర్యముకలిగి, ఆమె ఆ పుస్తక రచనను పూర్తిచేసింది.

రెండవ అధ్యాయము

# సాహిత్యంలోకి ప్రవేశము

హరినారాయణ్ ఆప్టేవంటి కొందరు స్నేహితుల సహాయంతో కానిట్కర్ 1886 జూలైలో "మనోరంజన్" (వినోదము) అనే పత్రికను ప్రారంభించాడు. దీని సంపాదకత్వంలో హరికి ప్రముఖ పాత్ర ఉన్నది. శ్రీమతి కానిట్కర్ వ్రాసిన "రంగ్ రావ్" అనే నవల, ఆప్టే వ్రాసిన "గణ్ పత్ రావ్" అనే నవల ఈ పత్రిక ప్రథమ సంచికనుండి ధారావాహికంగా ప్రచురించబడినవి. ప్రథమ సంచికనే ఆగర్కర్ చాలా ప్రశంసించి, కానిట్కర్ దంపతులను, ఆప్టేను తన స్నేహితులవద్ద చాలా మెచ్చుకొన్నాడు. మరాఠీ సాహిత్యానికి పితామహుడు అనదగిన కీ।శే। విష్ణుశాస్త్రి చిప్లూణ్కర్ జ్ఞాపకార్థము, ఆయన ప్రసిద్ధపత్రిక "నిబంధమాల" జ్ఞాపకార్థము 1883లో ప్రారంభింపబడిన "నిబంధ చంద్రిక" (The Essayist) అనే పత్రికతోకూడా హరినారాయణ్ ఆప్టేకు సంబంధము ఉండేది. ఆ పత్రిక కొన్ని ఇబ్బందులకు లోనైనప్పుడు ఆప్టే ప్రయత్నాలవల్ల "మనోరంజన్", "నిబంధచంద్రిక"లు రెండూ 1887 లో కలిపి వేయబడినవి. దాని ప్రచురణ 1892 వరకూ సాగింది. ఆప్టే తన సాంఘిక నవల "గణ్ పత్ రావ్"ను, "చాణాక్ష్ పణాఃకలన్" అనే ఉద్రేకోత్సాహాలను కలిగించే గ్రంథాన్ని (thriller); "జయధ్వజ్", "శ్రుతికీర్తి చరిత్ర", "సుమతీ విజయ" అనే నాటకాలను (ఇవి మూడు కాంగ్రీవ్ వ్రాసిన "దుఃఖిత అయిన

పెండ్లికూతురు" (The Mourning Bride). విక్టర్ హ్యూగో వ్రాసిన "హెర్నాని" (Hernani), షేక్స్‌పియర్ వ్రాసిన "ప్రతికి ప్రతి" (Measure for Measure) అనే గ్రంథాలపై ఆధారపడినవి); "మారూన్ సుట్ కున్ వైద్యబావా", "పశుపుట్య వైద్య" అనే ప్రహసనాలను, కొన్ని చిన్న కథలను, ఒక వ్యాసాన్ని, కొన్ని పద్యరచనలను ఈ పత్రికలో ప్రచురించాడు. అహ్మద్ నగర్ జిల్లా నెవాసెలో కానిట్‌కర్ సబ్‌జడ్జిగా ఉన్నప్పుడు ఆరు వారలపాటు ఆప్టే ఆ కుటుంబంతో కలసి ఉండి, షేక్స్‌పియర్, తుకారామ్‌వంటి ఆంగ్ల మరాఠీ కవులనుగురించి, మిల్, స్పెన్సర్‌ల సిద్ధాంతాన్ని, సంఘ సంస్కరణ, సమకాలిక రాజకీయాలనుగురించి, ఒకటేమిటి, ప్రపంచంలోగల సర్వ విషయాలనుగురించి చర్చిస్తూ కాలంగడిపాడు.

కళాశాలను పూర్తిగా వదలిన తరువాత 1888లో ఆప్టే ఒక ప్రచురణ సంస్థను నెలకొల్పవలెనని అనుకొన్నాడు. ఈ విషయము ఆయన కానిట్‌కర్‌కు వ్రాసిన ఒక ఉత్తరంవల్ల మనకు తెలుస్తున్నది. "కుల్‌కర్ణి ఆణిమణ్డలీ" (Kulkarni & Co.) స్థాపకులలో ఆప్టే ఒకడు. జీవితచరిత్రలు వరుసగా ప్రచురించాలెననే ప్రస్తావన జరిగింది. "కరమణూక్" (Recreation - విశ్రాంతి పూర్వక వినోదము) అనే వారపత్రికను నడపాలెనని ఆప్టే అనుకొన్నాడు. అందుకు కారణము కొద్దిపాటి విద్యగలవారు వినోదాన్ని, మానసిక ఔన్నత్యాన్ని కలిగించే సాహిత్యాన్ని చదవాలెనని ఆప్టేకుగల కోరికే. ప్రజలందరికీ రాజకీయాలే పరమావధికావడానికి వీలుండ పనీ, ఆ అవసరము వారికి తిలక్‌గారి "కేసరి, పత్రికవల్ల, ఆగర్

కర్‌గారు క్రొత్తగా ప్రారంభించిన "సుధారక్"వల్ల తీరుతున్నదని ఆప్టే అభిప్రాయము.

ఆప్టే ఆత్మగౌరవముకల వ్యక్తి, ప్రచురణ సంస్థను స్థాపించే ప్రయత్నంలో ఆప్టే ఉన్నాడని ఆయన పెత్తండ్రికి తెలిసినప్పుడు, ఆయన ఆప్టేకు తానేమీ ఈ విషయంలో సహాయంచేయనని వ్రాశాడు. ఆసందర్భంలో వారిద్దరికి ఘర్షణ జరిగింది తన స్వంత పథకాల (schemes) భారము ఆయనమీద వేయ దలుచుకోలేదనీ ఆయనవల్ల తనకేమీ ఆర్థిక సహాయం అవసరం లేదనీ ఆప్టే పెత్తండ్రికి చెప్పాడు. మరొక సంఘటనకూడా ఆయన స్వాతంత్ర్యాన్ని, ఆత్మగౌరవాన్ని తెలుపుతుంది. ఆనందాశ్రమ స్థాపన జరిగిన తరువాత ఆప్టే ఆశ్రమ ఆవరణములోనే ఉంటూ ఉండేవాడు. చాలా మంది స్నేహితులు ఆయన చుట్టూ చేరుతూ ఉండేవారు. ఒకసారి ఈ స్నేహితులతో కలిసి ఉండగా ఆయన పెత్తండి చూసి, ఇట్లా కాలము వృథా చేస్తున్నందుకు తన అనిష్టతను సూచించాడు. వెంటనే ఆప్టే ఆ ప్రక్కనే ఒక గది అద్దెకు తీసుకొని అందులోకి తన మకాం మార్చాడు. ఇది తెలుసుకొని ఆయన పెత్తండ్రి చాలా విచారించి, తన అభిప్రాయాన్ని వివరిస్తూ, సంఘసంస్కర్తలకూ, భాగ్యవంతులైన సోమరి పోతులకూ, రావ్‌సాహెబ్, రావ్‌బహాదూర్‌లకూ దూరంగా ఉండమని సలహాయిస్తు ఉత్తరం వ్రాశాడు. నిజానికి ఆయన అభిప్రాయం ఆప్టే తననిజమైన స్నేహితులకు దూరంగా ఉండమనికాదు. కాని సలహా మాత్రం ఆప్టేకు ఆ సమయంలో ఇవ్వతగినదే.

నిందలు, దూషణలు ఉపయోగించడం హరి స్వభావానికే విరుద్ధము. "లోకహితవాది" (గోపాల్‌రావ్ దేశ్‌ముఖ్), జ్యోతి

కాఫులే, ఆగర్కర్ వంటి సుప్రసిద్ధ సంఘసంస్కర్త లుపయోగించే పద్ధతులు ఆయనకు అంగీకారయోగ్యం కావు. ప్రజలను సమ్మతి పరచి, బుజ్జగించి మంచి పనులకు పురికొల్పి ఆవిధంగా సంఘానికి మేలు చేకూర్చవలెనని ఆయన అభిప్రాయము. దానినే ఆధారం చేసుకొని ఆయన "కరమణూక్" వార పత్రికను ప్రారంభించాడు. అప్పటికి ఆప్టే వయస్సు ఇరవైనాలుగు సంవత్సరాలు మాత్రమే. ఆయన సహజంగానే ఆశావాది. ఆయన భావాలు ఒక త్రోవకు వచ్చి స్థిరపడుతున్నవి. తినచుట్టూ జీర్ణదశలో ఉన్న సంఘము బాగుపడి, తద్వారా రాజకీయ స్వాతంత్ర్యము సాధించే నిమిత్తమె తాను అను కొన్న పనులు చేయడానికి ఆయన మనఃపూర్వాత్వమే ఆయనకు సహాయకారి అయింది. ఆయన ఆశయాన్ని సాధించడంలో ఆయన గ్రంథరచన నిజంగానే అంతిమజయాన్ని సాధించింది.

"కరమణూక్" ప్రథమ సంచిక 1890 అక్టోబరు 31వ తేదీ శనివారం విజయదశమినాడు వెలువడింది. ఆ తరువాత అది ప్రతి శనివారము ప్రచురింపబడేది. దాని మొదటి పుటలో ఒక సంస్కృత శ్లోకం ఉదహరింపబడేది. "ఇతరులు తమ వ్యవహారాన్ని తర్క యుక్తంగా వాదించినా, పరుషవాక్కులు ఉపయోగించినా, మేము మాత్రము మధురవాక్కులు ఉపయోగించడానికే అభిలషిస్తాము", అని ఆ శ్లోకానికి అర్థము. ప్రాపంచిక విషయాలను గురించిన జ్ఞానాన్ని వ్యాపింపచేయడమే కాకుండా, ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్నికూడా అందరికీ హృదయంగమంగానూ, అభిరుచికలిగించేది గానూ ఉండే భాషలో (ఆ భాష వెకిలితనములో కూడు కొన్నదీ, పటుత్వములేనిదీ, మిక్కిలి పారిభాషికయుతమైనదీ కాకూడదు) అందించడమే పత్రిక ఆశయమనీ, ప్రాక్పశ్చిమ సాహిత్యాలలోని

నవలలు, నాటకాల అనువాదాలు దీనిలో ప్రకటింపబడతాయనీ, అందువల్ల ఈ పత్రికను స్త్రీపురుష, బాలవృద్ధ వివక్షత లేకుండా అందరూ నిస్సంకోచంగా చదువవచ్చుననీ ప్రథమ సంచికలోనే ప్రకటించబడింది. చదువగల, చదువదలచిన వారికందరికీ అది మానసిక విశ్రాంతినీ, వినోదాన్నీ అందజేస్తుంది. చిన్నవి, పెద్దవి కథలు, విజ్ఞానశాస్త్ర విషయాలు సుబోధకమయ్యే వార్తలు, నాటకాలు, హాస్యరచనలు, ప్రసిద్ధ పురుషుల జీవిత చరిత్రలు, యాత్రా సంబంధములైన రచనలు, పద్యరచనలు, స్త్రీలకు సంబంధించిన వ్యాసాలు, క్రీడా వార్తలు, ఆవారంలో జరిగిన ప్రధాన వార్తలు ప్రతీ సంచికలోని విశేషాలు.

ఆప్టే వ్రాసిన నవల "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" ధారావాహికంగా "కరమణూక్"లో ప్రకటించబడ్డది. మరొక గమనించదగిన అంశమేమంటే ప్రథమ సంవత్సరంలో ప్రకటించబడిన ఇంచుమించు అన్ని సంచికలలోనూ మహాకవి కేశవ్‌సుత్ వ్రాసిన పద్యాలు ప్రకటించబడ్డవి. ఈవార పత్రిక జస్టిస్ కె. టి. తెలంగ్, ప్రొఫెసరు వి. చి. కేల్‌కర్, శ్రీమతి రమాబాయి రానడే (జస్టిస్ యమ్. జి. రానడే సతీమణి) శ్రీమతి కాశీతాయీ కానిట్‌కర్ తదితర ప్రముఖ వ్యక్తుల ప్రశంసలను పొందింది. తరువాత 12 సంవత్సరముల కాలములో ఆప్టే వ్రాసిన "మీ", "భయన్‌కర్ దివ్య", "జగ్ హే అసే ఆహే", "మహారాష్ట్ర్ చావాఘ్" (టిప్పుసుల్తాన్), "రూప్‌నగర్ చీరాజ్ కన్యా", కేవల్ స్వరాజ్యాసాఠీ" అనే నవలలు దీనిలో ధారావాహికంగా వెలువడ్డాయి. ఆప్టే వ్రాసిన మిగిలిన సాంఘిక, చారిత్రిక నవలలు, నాటకాలుకూడా దీనిలోనే ప్రకటించబడ్డాయి. ఈ పత్రిక 1917 వరకు నిరాటంకంగా ప్రకటించబడ్డది. తాను

వాగ్దానం చేసిన మేరకు ఈ పత్రిక స్వభావం ఏమాత్రం మారకుండా ఆప్టే జాగ్రత్త వహించాడు. చాలామంది స్త్రీలు తమ రచనలను ఈ పత్రికలో ప్రచురించారు. బాలబాలికలు ఈ పత్రిక సంవత్సర సంచికలను బహుకాలం చదివి ఆనందిస్తు వచ్చారు. పాత సంచికల చదవుతూ ఉంటేకూడా చాలా ఆనందంగా ఉండేది.

తానొక గ్రంథకర్తగా కాలక్షేపం చేయవలెనని ఆప్టే అప్పటికే నిశ్చయించుకున్నాడు. కాని తన కుటుంబ బాధ్యతలు నిర్వహించడానికి కావలసినంత ఆదాయం రావడానికి ఆ వృత్తిలో ఆయనకు వీలు కనపడలేదు. అందువల్ల ఆయన ఉపాధ్యాయ వృత్తి స్వీకరించ దలిచాడు. మరొకపని ఏదీచేయలేని వారికి అదే చివరి ఆశ్రయం గదా! కాని ఆ వృత్తి భవిష్యత్ ఫలసూచకంగా కనబడ లేదు. ఆప్టే పెత్తండ్రి ఆయన న్యాయశాస్త్ర పరీక్షలో కృతార్థుడయి, న్యాయవాది కావలెనని ఆశించాడు. కాని ఆయన విశ్వ విద్యాలయపు ప్రథమ సంవత్సరపు పరీక్షలోనైనా కృతార్థుడు కాలేక పోయినాడు. హరి తండ్రికికూడా ఆయన తప్పి పోవడానికి గల కారణాలు బోధపడలేదు. వారిద్దరూ ఆయనతో ఒకసారి ఈ విషయం ప్రస్తావించారు. కాని, అప్పటికింకా ఏ ఉద్యోగంలోనూ చేరక పోయినప్పటికీ, తాను ఏదో విధంగా ధన సంపాదనచేసి తీరతానని ఆయనవారితో వ్యంగ్యంగా అన్నాడు. కొన్నాళ్ళు ఒక ముద్రణాలయంలో పనిచేసి, తరవాత ముద్రణ వ్యాపారంలో ప్రవేశించమని పెత్తండ్రి సలహా ఇచ్చాడు. పెత్తండ్రి సహాయంతోనే జగదీశ్వర్ ప్రెస్‌లో పని నేర్చుకోవడానికి ఆయన చేరాడు. కాని ఆయన ముద్రణకు సంబంధించిన పరీక్షలోకూడా కృతార్థుడు కాలేకపోయాడు. తన జీవితమంతా నిరుత్సాహ పూరితమైన ముద్ర

జాలయపు వాతావరణంలో పనిచేయవలసి ఉంటుందనే విషయాన్నే ఆయన నమ్మలేక పోయినాడు. పుస్తక ప్రచురణ సంస్థనొకదానిని నెలకొల్పడంలో తగిన ఆర్థిక సహాయం చేసి తోడ్పడతానని పెత్తండ్రి అన్నాడు, కాని దానినికూడా హరి నిరాకరించాడు. తండ్రి, పెత్తండ్రు లిద్దరూ ఆయన విషయమై నిరాశ చెందారు. కాని పెత్తండ్రి ఇప్పుడు బాగా ఆర్జిస్తున్నాడు. ఆయన, తన తమ్ముని కుమారుని సాహిత్య సంపదను, అందులోనూ సంస్కృతభాషలో ఆయనకుగల జ్ఞానాన్ని గుర్తించాడు. తానొక సంస్థను స్థాపించి, అందులో హరికి ప్రవేశం కల్పించి, ఆయన సాహిత్య జ్ఞానానికి ప్రయోజనం కల్పిస్తానని ఆయన తమ్ముడికి వాగ్దానం చేశాడు. మొత్తం కుటుంబానికి తానేమీ మేలుచేయలేక పోయినాననే భావం కూడా పెత్తండ్రిని బాధపెట్టుతున్నది. అందుకని ఆయన "ఆనందాశ్రమ్" అనే పేరుతో ఒక ధర్మ సంస్థను ఏర్పరచి, తద్వారా తన మత రాహిత్య భావాలకు ప్రాయశ్చిత్తం చేసుకొందామని అనుకొన్నాడు. మత సాహిత్యాన్ని, పురాతన సంస్కృత గ్రంథాలను ప్రకటించడానికి ఒక ముద్రణాలయము, విద్యార్థులకు, సన్యాసులకు భోజన సౌకర్యాలతో ఒక వసతి గృహము, ఒక శివాలయము వీనిని ఏర్పరచడమే ఆయన ఏర్పరచ దలచుకొన్న సంస్థయొక్క లక్ష్యము. రు. 5,000 లతో పట్టణం మధ్యగా ఒక నివేశన స్థలాన్ని కొనడం త్వరగానే జరిగింది. తరువాత రెండు సంవత్సరాలలో ఆ సంస్థకు భవన నిర్మాణము జరిగింది. ఆ భవనానికి "వాస్తుశాంతి"ని (ఆ భవనాన్ని పవిత్రం చేయడం, దుష్ట ప్రభావాలనుండి దానిని తొలగించడం కొరకు చేసే కర్మ) మహాదేవ్ ఆప్టే శక సం॥ 1810, కార్తిక శుద్ధ ప్రతి పత్తున (క్రీ. శ. 1888లో కార్తిక శుద్ధ పాడ్యమి

శోజాన) జరిపి, ముద్రణాలయాన్ని ప్రారంభించాడు. ఆ విధంగా "ఆనందాశ్రమ్" స్థాపన జరిగింది. 1887 మే 17 వ తేదీన ప్రప్రథమంగా ఈ సంస్థ "ఆశయ" ప్రకటన జరిగినప్పుడు, 1837 మే 31 వ తేదీన వెలువడే "కేసరి" పత్రిక తన సంపాదకీయంలో ఈ సంసను హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తు, మత విషయిక, సంస్కృత గ్రంథాలను ప్రకటించడానికి యమ్. సి. ఆప్టే (మహాదేవ్ ఆప్టే) చేస్తున్న ప్రయత్నాలను మెచ్చుకొన్నది. ఈ సంస్థను నడిపే విషయంలో కావలసిన సకల వివరాలను పెత్తండ్రి వారికి పూర్తిగా చెప్పాడు. ఈ సంస్థ పరిపాలనా బాధ్యత యావత్తూ ఆయన వారిమీద ఉంచుతూ, ఆప్టే కుటుంబంలోని బాలుర పెంపకపు బాధ్యతనుకూడా ఆయనమీదనే ఉంచాడు. ఉపాధ్యాయ పదవి మానుకొని, ఈ సంస్థలో ఆర్థిక వ్యవహారాలు, ముద్రణ, ఉత్తర ప్రత్యుత్తరాలు, వ్రాతప్రతుల సేకరణ, వ్రాత ప్రతులను పరిపోల్చి పరిశీలించడం, సంస్థకు చెందిన గ్రంథాలయము, వ్రాత ప్రతుల కొమగోలు అమ్మకపు వ్యవహారము, నెలసరి ఆదాయవ్యయముల లెక్కలు, ఇవన్నీ వారి చూచుకోవలెననే ఏర్పాటు జరిగింది. "ఆనందాశ్రమ్"ను దర్శించవచ్చే అతిథులను ఆహ్వానించి, అచట జరిగే పనిని వారికి వివరించాలి. పగలు 11 గంటలనుండి సాయంత్రము గం 5-30ని వరకు అక్కడ తప్పక హాజరుగా ఉండవలె. ప్రారంభంలో ఆయన జీతము నెలకు రు 30 లు. అది క్రమంగా నెలకు రు 100 ల వరకూ పెరుగుతుంది. ఆ విధంగా ఆయనకు కొలది చాటి నిలకడ ఆదాయము ఏర్పరచ బడ్డది. ఆ విధంగా పూనాలో ఆయన ఒక కుటుంబపు యజమాని (Paterfamilias) అయినాడు. శుభప్రదమైన "గణపతి అథర్వశీర్షమ్" (గణపతి

ప్రార్థన) ముద్రణలో ఆనందాశ్రమ సంస్కృత ప్రచురణలకు ప్రారంభం జరిగింది. దేవాలయ నిర్మాణం జరిగింది. అక్కడి స్వామి అభిషేకజలము ఆయన పెత్తండ్రికి "సమాధి"గా నిర్ణయింపబడి స్థలములోకి పోవడానికి, తద్వారా పెత్తండ్రిని పవిత్రీ భూతుణ్ణి చేయడానికి ఏర్పాటు జరిగింది. ఆ సమాధి నిర్మాణానికి ప్రభుత్వానుమతిని పొందడంకూడా జరిగింది. 1890 నుంచీ ఆయన పెత్తండ్రి ఆరోగ్యం దెబ్బ తిన్నది. 1894 అక్టోబరులో "బాపట్ విచారణ సంఘము" (Bapat Commission) సంబంధంలో [illegible] రాక పోకల మూలంగా ఆయన ఆరోగ్యం మరీదెబ్బతిన్నది. సన్నిపాతజ్వరం తగిలి, మంచి వైద్య సహాయం జరిగినప్పటికీ ఆయన అక్టోబరు 22న మరణించాడు. తన నిర్ణయానికి అనుగుణంగా మరణానికి ముందు ఆయన సన్యాసము స్వీకరించాడు. హరి బొంబాయి పరుగెత్తి ఆయన ఆఖరి ఘడియ వరకు ప్రక్కనే ఉన్నాడు. ఆయన మృత దేహాన్ని పూనా తీసుకొని వెళ్లారు. "సన్యాసి"కి యథా విధిగా జరుగవలసిన అంత్యక్రియలు జరిగిన పిమ్మట మహాదేవ్ చిమ్నాజీ మృతదేహము పూర్వ నిర్ణయప్రకారము సమాధి చేయబడ్డది. త్వరలోనే "ఆనందాశ్రమ్" వృద్ధిపొంద నారంభించింది. ఈరోజు వరకూ అది తన పనిని నిరాడంబరముగా, ప్రశాంతంగా సాగించుకొని పోతూనే ఉన్నది. ఆ గొప్ప సంస్థ సంస్కృత భాషకొరకు చేసిన కృషికి ఆ భాష మహాదేవ్ చిమ్నాజీకి చాలా ఋణపడి ఉన్నది. పెత్తండ్రి ఏర్పరచిన నిబంధనలను హరి ఆప్టే తు. చ. తప్పకుండా ఆచరణలో పెట్టి, హిందూ సంఘ సంస్కరణ విషయంలో తన అభిప్రాయాలు ఎటువంటివైనా, తన జీవితాన్ని సనాతన హిందు మతానికి అంకితం చేసుకొని, అత్యంత మేధా సంపన్నుడైన తన

పెత్తండ్రి జ్ఞాపక చిహ్నమైన ఒక ధర్మ సంస్థగా దానిని సాగించాడు. తన తరువాతి జీవితములోని సుఖాలకు తన పెత్తండ్రి యొక్క మాతృదృష్టి, వితరణ కారణాలని, ఆయనకు తాను ఋణపడి ఉన్నానని వారి భావించాడు. గ్రంథకర్తగా ప్రసిద్ధి చెందడానికి, కుటుంబ బాధ్యతలను నిర్వహించడానికి, తన సంస్కృత భాషా జ్ఞానాన్ని హిందూ సంస్కృతి పునోభివృద్ధికై ఉపయోగించడానికి కావలసిన శక్తి వారికి "ఆనందాశ్రమ్" బాధ్యతను స్వీకరించడంవల్లనే కలిగింది.

వారి ఆప్టే భార్య, భర్త కోరిక ననుసరించి చదువను, వ్రాయను నేర్చుకోవలెనని ఎంతో ఉబలాట పడ్డది. కాని ఆమె చుట్టూ ఉన్న స్త్రీలందరూ పూర్తి సనాతన పరులు, మార్పును సహించలేనివారు కావడంతో ఆమె బహిరంగంగా చదవడంచాలా కష్టమయింది. అంతేకాకుండా వారు ఆమెను హేళన చేయడం, వేళాకోళం చేయడంకూడా సాగించారు. తన భార్య బాగా చదువుకోవలెననీ, సంభాషణలో మంచి నైపుణ్యం సంపాదించవలెననీ వారి ఆశించాడు. సాహిత్య చర్చలలో పాల్గొనలేక పోయినప్పటికీ, కనీసము తమ, తన స్నేహితులతో వారి భార్యలతో జరిపే సాంఘిక సమావేశపు చర్చలలోనైనా ఆమె పాల్గొనాలని వారికోరిక. కుటుంబములోని ఇతర స్త్రీలకు తెలియకుండా ఆమెను అప్పుడప్పుడు అటువంటి సమావేశాలకు, ఇతర సభలకు ఆయన తీసుకొని వెళ్లుతూ ఉండేవాడు. కాని ఆమె తిరిగి ఇంటికి రాకమునుపే ఆ ఇంటి వృద్ధ స్త్రీలకు ఆమె ఎక్కడికి వెళ్లింది తెలిసేది. ఆరోజులలో గృహ పవిత్రతను గురించిన భావాలు చాలా కఠినంగాను,

సడలించడానికి వీలులేనివిగాను, మొండిగాను ఉండేవి. మధు ఇంటికి వచ్చిన తరువాత తన దుస్తులను మార్చుకొన్నప్పటికీ, పూర్వాచార పరాయణులైన వృద్ధ స్త్రీల మొండి పట్టుదలవల్ల, ఇంటిలో అందరితో పాటు తిరిగి, యింటి పనులు చేయడానికి ఆమె వీలుండేది కాదు. అందువల్ల ఆమె మనసుకు సహజంగానే కష్టం కలిగేది. ఆ కారణంచేత అటు భర్తను సంతోషపరచాలని, ఇటు పూర్వాచార పరాయణులైన వృద్ధ స్త్రీలతో సత్సంబంధాలను కలిగి ఉండాలని ఆమెకుగల కోరికలు నెరవేరలేదు. ఈ నిర్బంధాలకు లోబడి ఆమె తన పాఠాలను చదువలేక చాల బాధపడేది. కుటుంబమునుంచి వేరుపడి "ఆనందాశ్రమ్"లో విడిగా కాపురము పెట్టవలెనని ఆమె చాలాసార్లు భర్తను ఒత్తిడి చేసింది. అక్కడ విడిగా ఉంటే తమ అభిప్రాయాల కనుగుణంగా తమ జీవితాన్ని మలుచుకోవడానికి అవసరమయిన స్వాతంత్ర్యముంటుందని ఆమె చెప్పింది. కాని కుటుంబంలో ఉన్న పెద్దల మనసులకు కష్టం కలిగించడానికి ఏ మాత్రం ఇష్టంలేనివాడై, హరి ఆప్టే ఆపద్ధతికి చాలాకాలమువరకూ అంగీకరించలేదు. అందువల్ల చాలా సంవత్సరాలవరకు ఆక్లిష్ట పరిస్థితి పరిష్కారం కాకుండానే ఉండి పోయింది. పాపము! మధు నిరాశతో కుములిపోయింది. పిరికి తనంతో, బిడియముతో చాటుగా కన్నీళ్లు కారుస్తు ఉండేది.

వారికి ఒక మగశిశువు కలిగి మూడు మాసాల లోపునే చనిపోయాడు. 1391 ఫిబ్రవరిలో ఆమె రెండవసారి మగ శిశువు కలిగాడు. కాని ఆమెకు బాలింత జాడ్యము వచ్చి, వీలున్నంతలో వైద్య సహాయం జరిగినప్పటికి ప్రయోజనం లేక ఆమె చనిపోయింది.

తల్లి చనిపోయిన పిదప పసిబిడ్డ ఏడువారాలు బ్రతికి, బలహీనపుబిడ్డ కావడంచేత చనిపోయింది.

భార్యచావు, తరువాత మగశిశువు చావు ఈ రెండు హరి ఆప్టేకు హృదయఘాతము కలిగించాయి. ఆయన మానసికంగా చాలా వ్యథచెందాడు. ఆ మానసిక వ్యథ ఫలితంగా ఆయనకు జబ్బు చేసింది. ఆయాసము రావడం, ఊపిరి అందక పోవడం జరిగింది. ఆయన హృదయ ఘాతంవల్ల, ఆమెకు తాను స్వతంత్ర జీవనపు ఏర్పాట్లు చేయలేక పోయినాననే విచారం ఇనుమడించింది. కాని తాను చేసిన తప్పులను, తన ఆదర్శపు తీవ్రతలో తాను ఆమెకు కలిగించిన దిగ్భ్రమము, భయము, బాధలను గురించి ఆయన ఆలోచించే సమయం దాటిపోయింది. తన తప్పిదాలకు ప్రాయశ్చిత్త పూర్వకంగా ఆయన పంచదార వాడడం, తాంబూలం వేసుకోవడం మానివేశాడు. నేలపైన చాప పరుచుకొని పడుకోవడం ప్రారంభించాడు. పశ్చాత్తాపము, నిరాశ అనే భావాలనుంచి విముక్తి పొందడానికి ఆయనకు చాలాకాలము పట్టింది.

ఆ సంవత్సరము మేనెలలో తమతోపాటు మహాబలేశ్వర్ (మహారాష్ట్ర)లో ఒక వేసవి విడిదిలో గడపడానికి రమ్మని కానిట్కర్ దంపతులు ఆయనను ఆహ్వానించారు. అచ్చట ఆయన ఉనికి, కొంతవరకు ఆరోగ్యాన్ని పొందడానికి, నిస్పృహను అధిగమించడానికి తోడ్పడింది. ఆ ప్రదేశమందలి ప్రకృతి సౌందర్యము, కానిట్కర్ దంపతుల ప్రేమపూర్వకమైన ఆదరమూ ఆయన తన దుఃఖాన్ని కొంతవరకు మరిచి పోయేటట్లు చేశాయి. శ్రీమతి కానిట్కర్ ప్రోద్బలంవల్ల ఆయన తిరిగి తేనీటిలోను, భోజనంలోను

పంచదార వాడడం మొదలు పెట్టాడు. మహాబలేశ్వర్‌లో ఉన్నప్పుడు పండితుడు, సంస్కర్త అయిన జస్టిస్ మాధవ్ గోవింద్ రానడేను ఆయన కలుసుకొన్నాడు. జస్టిస్ రానడే కానిట్కర్‌ల గృహానికి వచ్చాడు. కానిట్కర్ దంపతులను, ఆప్టేను తన గృహానికి ఆహ్వానించాడు. తనకు స్నేహితుడు, సంస్కర్త అయిన ఒకానొక వ్యక్తి యొక్క వయస్సు వచ్చిన కుమార్తెను ఆప్టే వివాహం చేసుకోవలెనని రానడే అభిప్రాయము. ఆ విషయము ఆయన శ్రీమతి కానిట్కర్‌తో ప్రస్తావించాడు. ఆమె చాలా సునిశితమైన బుద్ధి కలది. ఇంటిలో అమలుజరిగే పూర్వాచారపు పద్ధతులవల్ల ఆప్టేకు అది అంగీకారము కాకపోవచ్చునని ఆమె ఆయనకు చెప్పింది. అక్కడ నుండి హరి పూనాకు తిరిగి వచ్చిన తరువాత పెద్దలు ప్రతిదినము ఏదో ఒక వివాహ సంబంధాన్ని గురించి ఆయనతో ప్రస్తావిస్తూ వచ్చారు. ఆయన మానసిక స్థితినిగాని. ఆ విషయంలో ఆయనకున్న అనిష్టతనుగాని వారు గమనించలేదు. బొంబాయిలో విధురుడుగా ఉండిన ఆయన పెత్తండ్రిని మనసులో ఉంచుకొని, హరితండ్రి, మిగిలిన బంధువులు మొదలైన పెద్దలు ఆయన భావి జీవితాన్ని గురించి వ్యథపడసాగారు. ఆయన నాయనమ్మకూడా పట్టుబట్టింది. ఆమె అంటే ఆయనకు చాలా గౌరవము. అందువల్ల చివరకు ఆమె ఆజ్ఞలను జవదాటనని, ఆమె కోరికను నిరాకరించనని వాగ్దానం చేయక తప్పలేదు. అయినప్పటికి ఆయన ఇదివరలో పలుమారులు బాల్య వివాహాలను ఖండించి ఉన్న కారణంచేత చిన్న వయస్సులో ఉన్న బాలికను వివాహం చేసుకోవడానికి తన మనసును సమాధాన పరుచుకోలేకుండా ఉన్నాడు. (ఆ రోజుల్లో మరీ తక్కువ వయసులో ఉన్న బాలికలకు వివాహం చేయడం ఆచారంగా

ఉండేది.) అది కారణంగా ఆయన విరామ రహితమైన ప్రజాహిత జీవితంలో మునిగి పోవడానికి నిర్ణయించుకున్నాడు.

ఇక్కడ ఒక విషయాన్ని చెప్పాలి. 1890 అక్టోబరు 4న శ్రీ గోపాల్ రావ్ జోషీ "పంచ్ హౌద్ మిషన్" అనే క్రైస్తవ సంస్థను నెలకొల్పాడు. పూనా క్రైస్తవ మిషన్ భవనంలో ఒక ఉపన్యాసానికి, తేనీటికి ఏర్పాట్లు జరిగాయి. ఆ రోజులలో అక్కడ ఫాదర్ రివింగ్టన్ వద్ద ఆప్టే ఫ్రెంచి చదువుకుంటున్నాడు. ఆ సమావేశానికి జస్టిస్ రానడే, లోకమాన్యతిలక్, ప్రొఫెసర్ జి. కె. గోఖలే (తరువాత ఆయన ఆనరబుల్ మిస్టర్ గోఖలే అయినారు), ప్రొఫెసర్ వి. బి. కేల్కర్, ప్రొఫెసర్ పాన్సే, వాసుదేవ్ రావ్ జోషీ మొదలయిన పూనాలోని పెద్దలందరికీ ఆహ్వానాలు వెళ్లాయి. అక్కడకు వెళ్లినవారిలో కొందరు తేనీరు, బిస్కట్లు పుచ్చుకొన్నారు. ఆప్టే సన్నిహిత జ్ఞాతి ఒకరు చనిపోవడంచేత ఆ రోజు ఉపన్యాసానికిగాని, తేనీటికిగాని ఆయన హాజరు కాలేక పోయినారు. ఆ సమావేశంలో పాల్గొన్న వారివీ, పాల్గొనని వారివీ పేర్లన్నీ కలిపి గోపాల్ రావ్ జోషీ పూనాలోని పూర్వాచార పరాయణుల పత్రిక "పూనా వైభవ్"లో ప్రకటింపజేశారు. ఈ చిన్ని సంఘటన ఒక దుమారమై, దీనివల్ల నలువది రెండు కుటుంబాలను పూర్వాచార పరాయణులు, పురోహితులు సంఘ బహిష్కారం చేయడం జరిగింది. పురోహితులు వారిండ్లలో శ్రోత్రియ కర్మలు చేయించడానికి, బంధువులు, స్నేహితులు వారిండ్లకు పోవడానికి నిరాకరించారు. ఈ కుటుంబాలలోని వారికందరికీ—అందులో ప్రత్యేకము స్త్రీలకు—జీవితము దుర్భరమైంది. శ్రోత్రియ కర్మలు జరగడానికి వీలులేకుండా పోయింది. పెండ్లి అయిన

ఆడపిల్లలు. తల్లిదండ్రుల యిండ్లకు, వారు పిలవడానికి గాని, పిలిచినా వీరు పోవడానికి గాని వీలులేకుండా పోయింది. తల్లిదండ్రులు, వారి బిడ్డలు ఇంచుమించుగా విడిపడి పోయారు. ఇది చాలా దుఃఖానికి కారణమయింది. మ్లేచ్ఛుల చేతి పదార్థాలు పుచ్చుకొన్న పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోడానికి జస్టిస్ రానడే ముందుకు వచ్చినప్పుడు మాత్రమే ఆ ప్రతిష్టంభన పరిష్కారమయింది. మిగిలిన వారందరూ కూడా ఆపని చేసిన తరువాత వారిపై సంఘ బహిష్కారము రద్దు అయింది. ఆ సమావేశంలో హరి ఆప్టే పాల్గొనకపోయినప్పటికీ ఆయన పేరు "పూనా వైభవ్"లో ప్రకటింపబడిన పట్టికలో ఉన్నది. ఆప్టే తండ్రి నానాసాహెబ్‌కు ఆయనమీద చాలా కోపం వచ్చింది. ఆప్టేల గృహంలో సర్వమతి కర్మలు ఆగిపోయాయి. ఆప్టే పితామహి ఈ మానసిక వ్యథమూలంగా జబ్బుపడి చనిపోయింది. ఈ సందర్భంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగినట్లు తెలుస్తుంది. ఆప్టే నాయనమ్మ ఆయనకు కలలో కనబడి తాను ఈ లోకాన్ని వీడిపోతున్నట్లు చెప్పింది. ఈ కలవల్ల నిద్రాభంగమై ఆప్టే మేల్కొని క్రిందికి దిగివచ్చి కాపలా మనిషిని ఎన్నిగంటలయిందని అడిగాడు. 2 గంటలని అతను చెప్పాడు. మరొక్క నిముషంలో వారింటినుంచి ఆమె చనిపోయినట్లు కబురు వచ్చింది. ఆయన "ఆనందాశ్రమ్"లో ఉంటూ, భోజనానికి దగ్గరనే ఉన్న తమయింటికి వెళ్లుతూ ఉండేవాడు. వారి కుటుంబానికి ఉన్న సంఘ బహిష్కారమువల్ల పెత్తండ్రి అన్నాసాహెబ్ చాలాకష్టం మీదగాని పురోహితుణ్ణి సంపాదించ లేకపోయినాడు. కాని ఆప్టే ఆ పైన చెప్పిన సమావేశంలో బిస్కట్లుగాని, టీ.యగాని పుచ్చుకోవడమే కాదు, చివరకు ఆ సమావేశానికి హాజరు కావడంకూడా చేయనందున, శంకరాచార్య సంఘంవారు తిరి

వాళ్ళు కొన్ని రోజులకు ఆప్టేను ఆ నిందనుండి విముక్తిచేశారు. ఆప్టే తండ్రి ఆప్టే ఆ సమావేశానికి హాజరు కాలేదన్న విషయాన్ని పత్రికా ప్రకటనకూడా చేయించాడు.

స్త్రీవిద్య అంటే ఆప్టేకు నిజమైన ఆసక్తి ఉన్నది. అందువల్ల దాని విషయమై జరిగే అన్ని ప్రయత్నాలకూ ఆయన హృదయపూర్వకమైన సహాయం ఉన్నది. అదే కారణంచేత పండిత రమాబాయి (తరవాత ఈమె క్రైస్తవ మతాన్ని స్వీకరించింది) ప్రయత్నాలను, పూనాలో ఆమె స్థాపించిన "సేవాసదన్" అనే సంస్థను ఆయన మిక్కిలి కొనియాడాడు. "సేవాసదన్" యొక్క విద్యావిషయిక కార్యకలాపాలను జస్టిస్ రానడే, ప్రొఫెసర్ భాండర్కర్, ప్రిన్సిపలు ఆగర్కర్, జస్టిస్ కె. టి. తెలంగ్ వంటి పూనాలోని పెద్దలు సానుభూతితో ఆదరించారు. "సేవాసదన్"లో చాలామంది హిందూ బాలికలను క్రైస్తవులుగా మార్చడానికి రమాబాయి కారణభూతురాలయిందని నిర్ధారణ అయిన పిదపనే హిందూ నాయకులు ఈ దొంగతనపు మతాంతరీకరణాన్ని తీవ్రంగా నిరసించి, మతాంతరీకరణకు పూనుకొన్న ఈ క్రైస్తవ సంస్థతో సంబంధాన్ని పూర్తిగా తెంపివేసుకొన్నారు.

"ఆనందాశ్రమ్"లో పనిచేస్తున్నందువల్ల సంఘసంస్కర్త అయినకూడ, విధవా వివాహం చేసుకోవడానికి ఆప్టేకు వీలుకాలేదు. అటువంటి వివాహమే ఆయన చేసుకొని ఉంటే ఆయన బంధువులందరితోటి తెగతెంపులు జరిగేవి. అటువంటి వివాహం జరగకుండా ఉండడానికే ఆయనకు త్వరగా వివాహం చేయవలెనని ఆయన బంధువులు తొందరపడసాగారు. 1891 లో నాగపూర్ కాంగ్రెసు

సమావేశానికి వెళ్లబోయే ముందు ఆయన మాతామహి ఆయనవుండి విధవా వివాహం చేసుకోనని బలవంతంగా ఆయన కిష్టంలేని వాగ్దానాన్ని ఆయనవద్దనుండి తీసుకొన్నది. కాని త్వరగా వివాహం చేసుకోవడానికి ఆయన ఒప్పుకోలేదు. అందువల్ల ఆయన తండ్రి, పెత్తండ్రి ఇతర బంధువులు ఆయనతో మాట్లాడడం ఇంచుమించుగా మాని వేశారు. ఆయన సంభాషణ ప్రియుడు, హాస్యయుక్తంగా మాట్లాడడం ఆయనకు ఇష్టం కావడంచేత, ఇది చాలా కష్టం కలిగించింది. పరిస్థితులు మెరుగు పడడానికి ఏదో ఒకటి వెంటనే జరగవలెనని గ్రహించిన ఆయన స్నేహితుడు ప్రొఫెసర్ పానసే ఆయనకు సం చదువుకొన్న బాలికను వెదకడం ఆరంభించాడు. అప్పుడు పాన్సేకు చోల్కర్ గారి కుమార్తె వేణుతాయిని గురించి తెలిసింది. ఆమె చదువుకొన్నది. ఆమెకు ఆప్టేకు అట్టహాసం లేకుండా 1892 ఫిబ్రవరిలో వివాహము జరిగింది. కట్నం ఏమీ లేదు. వివాహం కాగానే ఆమెకు "రమా" అని నామకరణం జరిగింది. ఆప్టే తల్లి దండ్రులు అప్పుడు బెల్గామ్‌లో ఉన్నారు. వారికిగాని, పెత్తండ్రికి గాని కబురు అందలేదు. వారు రాలేదు. వివాహం అయిన తరువాత వారికి సమాచారం పంపడం జరిగింది. వారు నూతన వధూవరులను బెల్గామ్‌లో కలుసుకొని తమ గృహానికి తీసుకొని వెళ్లారు.

విధవా వివాహం చేసుకొని, నిజమైన సంఘ సంస్కర్తగా ప్రవర్తిస్తాడని ఊహించిన సంస్కర్తలయిన ఆయన స్నేహితులు ఆయన చేసుకొన్న ఈ పురాతనాచారపు వివాహాన్ని పూర్తిగా విమర్శించారు. జస్టిస్ రానడే కూడా తన సంస్కరణాభిప్రాయాలను ఆచరణలో పెట్టలేకపోయినాడనే విషయాన్ని వాళ్లు విస్మరించారు. ఆప్టే విషయంలో పరిస్థితులుకూడా అందుకు భిన్నంగా లేవు. ఆయన

తన కుటుంబ బాధ్యతల విషయంలో తగు జాగ్రత్త వహించవలసిన అవసరం ఉన్నది. సంఘ సంస్కరణకోసమని తొందరపాటుగా ప్రవర్తించి సఖ్యత, ప్రేమ, పరస్పరాశ్రయములకు ఆలంబమయిన మొత్తము కుటుంబాన్ని ధ్వంసం చేయడానికి వీలులేదు. రెండవ వివాహం చేసుకొన్న తరువాతకూడా చాలా కాలంవరకూ విచారంగానే ఉన్నాడు. ఆ విచారాన్ని జయించడానికి ఆయన తీవ్రంగా గ్రంథ రచనలో నిమగ్నుడైనాడు. భోజనానికి, హాస్య పూరితమైన సంభాషణ చేయడానికి, మాత్రం ఇంటికి వచ్చేవాడు. ఆయన ఇతర మనోవ్యథలకు ఆయన ద్వితీయకళత్రం అనారోగ్యం తోడయింది. ఆమెకూడా భర్త విచారానికి బాధపడ్డదికాని దాన్ని తొలగించడానికి ఏమీ చేయలేకపోయింది. ఆమె ఉమామాక్షి (ఆప్టేమేనత్త) యొక్క తీవ్ర క్రమశిక్షణకు లోబడి పనిచేయవలసి ఉన్నది. ఆమె ఆరోగ్యాన్ని గురించి, వైద్యాన్ని గురించి ఆప్టే ప్రశ్నిస్తే కుటుంబంలోని పూర్వాచార పరాయణులైన స్త్రీలు వ్యతిరేక విమర్శన చేయసాగించారు. ఇది సహజంగా ఆప్టే భార్యకు చాలా బాధకలిగించింది. ఆప్టే తండ్రి డాక్టరు అదావలె అనే తన స్నేహితుణ్ణి ఆమెకు వైద్యము చేయమనికోరాడు. ఆయన ఆమెను రోజూ ఉదయంకాల కొంత దూరము నడవమని సలహా యిచ్చాడు. ఇందువల్ల పరిస్థితులు ఇంకా విషమించాయి. నడకతోను ఆమె యింటివద్ద మామూలు గృహకృత్యాలు నిర్వహించవలసి వచ్చింది. ఈ పరిస్థితులన్నింటివల్ల ఆమె అశాంతంతో కూడుకొన్న జీవితాన్ని నడపవలసి వచ్చింది. "ఆనందాశ్రమ్"లో వారిరువురు కాపురం ఉండాలి అనే తండ్రి సూచనకూడా అమలులోకి రాలేదు. ఆప్టేకు ఆ పని చేయడం ఇష్టంలేకపోవడమే అందుకు కారణము. వేణుతాయి అశాంతంగా మరికొన్ని సంవత్సరాలవరకూ అలాగే ఉన్నది. ఈ మధ్యకాలంలో 1902 లో

కుటుంబ పెత్తనం చేస్తున్న చిమాబాయ్ షీ నంజా వ్యాధివల్ల చనిపోయింది. ఆప్టే అప్పుడు పూనాలో లేనందున ఆమె చనిపోయిన సమయంలో ఆయన ఆమెదగ్గర లేడు. కఠిన క్రమశిక్షకురాలయినా, ఆమె విస్మృతిపాలి. ఆమె మరణంవల్ల వేణుకు ఇంకా బాధ ఎక్కువైంది. ఆమెకు నరాల జబ్బుచేసింది. అప్పుడు మాత్రమే ఆప్టేకు ఆమెయందు తాను అనుకోకుండా చూపుతున్న నిర్లక్ష్యముయొక్క దుష్ఫలితాలు బాగా అర్థంఅయినాయి. చిట్టచివరకు ఆయన "ఆనందాశ్రమ్"కు ఆమెను తీసుకొని వెళ్లాడు. అప్పటి తన మానసిక స్థితిని ఆయన శ్రీమతి కాశీబాయి కానిట్కర్ కు వ్రాసిన ఒక ఉత్తరంలో తెలియబరచాడు. ఆమెను తన యింటికి ఆహ్వానించి ఆదరించడానికి గల తన అశక్తతను తెలిపాడు. వృ[illegible]ను గురించీ, తన మరణాన్ని గురించీ మాట్లాడడం వరకు వెళ్లాడు. ఆయన నిరాశకు హద్దులు లేకుండా పోయాయి. ఇన్ని రోజులుగా తాను నిరాశకూ, ఆశాభంగానికీ లోనయినప్పటికీ, తన భార్యయొక్క భావాలను నిర్లక్ష్యం చేయడం క్షమింపరానిదని ఆయన భావించాడు. పశ్చాత్తాపానికి లోనై, "ఆనందాశ్రమ్"లో ఆమెకు శ్రద్ధగా సేవచేయడం ద్వారా పూర్వ పరిస్థితులను సరిదిద్దడానికి ఆయన ప్రయత్నించాడు 1903 లో వారి దాంపత్య జీవితంలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. వేణుతాయి అత్యంత ఉత్సాహంతో సంతోషంతో గృహిణీ జీవితాన్ని ఆరంభించింది. ఆమె సుగుణ సంపదను చూచి ఆప్టే ఆశ్చర్యపడ్డాడు. ఇదివరలో వాటిని గమనించనందుకు ఆయన విచారించాడు. 1903 తరువాత ఆయన జీవితం తృప్తితోను, సంతోషంతోను గడిచింది. ఆయన అవసరాలను గురించీ, ఇష్టానిష్టాలను గురించీ శ్రద్ధవహిస్తూ, అంతర్యములైన తన కోరికలను నెరవేర్చుకోవడంలో ఆయనకు సహాయ పడడానికి వేణు చాలా శ్రమ పడింది.

కాని వేణు తిరిగి 1905 లో జబ్బుపడ్డది. ఆ వేసవిలో ఆరోగ్యం కోలుకోవడానికి ఆమెను లోనవ్లా తీసుకొని వెళ్లారు. 1906 లో వారికొక కుమార్తె కలిగింది. కాని వేణు మరల జ్వరానికి గురి అయింది. ఆ జ్వరం సన్నిపాత జ్వరమని నిర్ణయించారు. అదృష్ట వశంచేత నాలుగు వారాల తరువాత ఆమె కాలు క్రింద పెట్టకలిగింది. అప్పుడు పసి బిడ్డకు భారసాల చేసుకొని ఆ బిడ్డకు శాంత అని నామకరణం చేశారు. ఆ దంపతు లిద్దరికీ ఆ పిల్ల పోషణలోనే కాలం గడిచిపోతూ ఉన్నది. వారి కుటుంబ జీవితం సంతోష ప్రదమయింది.

ఆప్టే నిత్యజీవిత కార్యక్రమము తృప్తికరంగా స్థిరపడిపోయింది. ఆయన ప్రతి దినము తెల్లవారు జామున ౫ గంటలకు లేచి వ్రాసుకోవడానికి గ్రంథాలయములో తన బల్లముందు కూర్చొనేవాడు. రెండు, రెండున్నర గంటలు వ్రాసుకొన్న తరువాత తేనీటికి, కూతురుతో కొంచెం సేపు ఆడుకోవడానికి క్రిందికి వచ్చేవాడు. ఇంతలో ఆయన స్నేహితులు వచ్చేవారు. అందరు తేనీరు తీసుకొని దగ్గరలోనే కొండమీద ఉన్న పార్వతి ఆలయం (నగరం నుంచి సుమారు మైలున్నర దూరం) వరకు వాహ్యాళి వెళ్లేవారు. తిరిగి వచ్చేటప్పుడు త్రోవలో మరి కొంతమంది స్నేహితులను తప్పక కలుసుకొని వచ్చేవారు (నిత్యమూ వారిని కలుసుకోవడం అలవాటు). తిరిగి వచ్చేసరికి సుమారు 7-30 అయ్యేది. ఆప్టే అప్పుడు ఉత్తర ప్రత్యుత్తరాలు చూసుకొని దిన పత్రికలు, వార, మాస పత్రికలు చదివేవాడు. ఆ తరువాత "ఆశ్రమ్"లోకి వచ్చిన సన్యాసులను దర్శించి; భవనంలో నివాసంగా ఉంటున్న విద్యార్థులను కలుసుకొని, పిమ్మట ఇతర ఆగంతకులను కలుసుకొనేవాడు, "ఆనందాశ్రమ్"లోని నియమాలు ఆచారం ప్రకారము అతిథులైన సన్యాసులను పూజించి వచ్చి

సుమారు 10-30 గంటలవేళ ఆయన తన ఉదయపు భోజనం చేసే వాడు. ఒక గంటలో భోజనాదికాలను పూర్తిచేసుకొని, "ఆనందాశ్రమ్"కు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు, ప్రచురణ, ముద్రణ మరి ఇతర పనులను సాయంత్రం గం 5-30 వరకూ చూచుకొనే వాడు. ఈ మధ్యలో ఎప్పుడైనా విశ్రాంతి లభిస్తే గ్రంథ పఠనం చేసేవాడు. సాయంకాలము 3 గంటలప్పుడు తేనీటి కోసం కార్యక్రమాన్ని కొద్దిసేపు ఆపేవాడు.

సాయంత్రం 5 గంటలకు ఆయన స్నేహితులు కొందరు వచ్చే వారు. వారితో తేనీరు, పేకాట, వర్తమాన వ్యవహారాల చర్చ వీటితో కాలం గడిపేవాడు. సుమారు రాత్రి 8 గంటలవేళ స్నేహితులు వెళ్లిపోయేవారు. అప్పుడాయన భార్యతోను, కుమార్తెతోను గుర్రపు బండిలో పట్నంలోకి వెళ్లేవాడు. రాత్రి భోజనం కాగానే భజన పాటలు (సాధారణంగా తుకారామ్ అభంగాలు) పాడేవాడు. మత గ్రంథాలు, పవిత్ర సంస్కృత గ్రంథాలు ఆయన పఠించడం ప్రత్యేకంగా ప్రశంసించ తగ్గది. దాసబోధ (రామదాసస్వామి మహాకవి కృతము) అనే మరాఠీ గ్రంథాన్ని ఎక్కువ శ్రద్ధతో చదివే వాడు. రాత్రివేళ చాల పెందలకడనే నిద్రపోయేవాడు. చాలా సంవత్సరాలవరకు ఆయన నిత్యకార్యక్రమము ఈ విధంగా ఉండేది.

సంఘంలోని అన్ని అంతస్థులలోనివారు-ఒక్క మహారాష్ట్రమందేకాక, గుజరాత్, బెంగాల్ నుండి కూడా - ఆయనకు స్నేహితులు చాలామంది ఉండేవారు. అతిథి సత్కారానికి ఆయన ప్రసిద్ధి చెందాడు. ఆయనకున్న ఈ అతిథి సత్కార గుణము ఆయన భార్య మీద గురుతర బాధ్యతను వేసింది. అతిథులు ప్రతి దినము ఒకరో

అని లేకుండా వచ్చేవారు. ఆప్టే కుటుంబం కూడ పెద్దది కావడం చేత బంధువులు ఎవరో ఒకరు ఎప్పుడూ ఉంటూనే ఉండేవారు. బొంబాయి కౌన్సిలు సమావేశము వర్షాకాలంలో పూనాలో జరిగే సమయాలలో కౌన్సిలు సభ్యులు శ్రీ హరి సీతారామ్ దీక్షిత్, కృష్ణరావ్ వాడ్‌లే మొదలయినవారు ( ముఖ్యంగా మితవాద వర్గమువారు) వచ్చి ఆప్టే గృహంలో బస చేసేవారు. పూనాలో తిలక్ గృహం వలెనే, ఆప్టే గృహం కూడా రాజకీయవాదులకు కేంద్రంగా ఉండేది.

గృహ సేవకులతో గాని, "ఆనందాశ్రమ్"లో తన కింద పని చేసే వారితో గాని ఆయన సంబంధాలు ఎక్కువ దయతో కూడుకొని ఉండేవి. శ్రీ రామ్‌సింగ్ అనే అతను "ఆనందాశ్రమ్"లో ముఖ్యులు శ్రద్ధ విశ్వాసముగల పనివాడు. అందరు ఉద్యోగుల అవసరాలను ఆప్టే కనుగొని తీరుస్తూ ఉండేవాడు. వారెవరైనా జబ్బుపడితే వారి వైద్యసహాయానికయ్యే వ్యయము భరించేవాడు. భయంకరమైన ప్లేగు వ్యాధి వ్యాపించినప్పుడు ఆయన చేసిన మానవసేవకు సంఘము, ప్రభుత్వము చాలా మెచ్చుకొన్నారు. తన వ్యక్తిగత ప్రమాదాన్ని కూడా గణించకుండా సేవ చేశాడు.

"ఆనందాశ్రమ్"కు రకరకాల స్వాములు, సన్యాసులు వస్తూ ఉండేవారు. ఆప్టే దంపతులు, తాము అంగీకరించి చేయనిశ్చయించుకున్న విధికి అనుగుణంగా వారందరిని గౌరవించడానికి చేయవలసినదంతా చేసేవారు. కాని స్వాములందరూ మామూలు పద్ధతిగా ఉండేవారు కారు. ఒకాయన చీకట్లో భోజనం చేస్తాననేవాడు, మరొకాయన, గృహస్థు కాని, ఆయన భార్య కాని తన చేతిలో ముద్దలు చేసి పెట్టితేనే భోజనం చేస్తాననేవాడు. మరింకొకాయన [illegible]

ముఖం చూడననేవాడు. ఇటువంటి వారివల్ల అప్పుడప్పుడు ఏవో సమస్యలు ఉత్పన్నమయ్యేవే కాని వాటి నన్నింటిని ఆప్టే చేతనైనంత కాగా, స్నేహ పద్ధతిలో పరిష్కరించేవాడు. కొందరు బూటకపు సన్యాసులు కూడా వచ్చేవారు. వారిలో ఒక స్వామి చరిత్ర చాలా చోద్యంగా ఉంటుంది. ఆ స్వామి ఆప్టే తండ్రిని తన వలలో వేసుకున్నాడు. ఆప్టే తండ్రి ఈ ప్రపంచంలో సర్వాన్నీ వదలి ఆయన వెంట వెళ్ళిపోతానని చెప్పటం ప్రారంభించాడు. ఆప్టే బావమరిది ఒక రోజు వారింటికి భోజనానికి వచ్చినప్పుడు ఆ స్వామి బూటకము బయటపడ్డది. తన భోజనము అయిన తరువాతనే మిగిలిన అందరూ భోజనము చేయవలెనని స్వామి ఆదేశించాడు కాని ఎంత సేపయినా భోజనానికి రాకుండా ధ్యానము అనే పేరుతో, తక్కిన వారి భోజనానికి చాలా ఆలస్యమయ్యే విధంగా ప్రవర్తించేవాడు. ఆ రోజున (ఆప్టే బావమరిది భోజనానికి వచ్చిన రోజున) ఆ స్వామి విపరీతంగా ఆలస్యం చేశాడు. స్వామిని పిలవడానికి వెళ్ళి, ఆప్టే దంపతులు, తలుపు తెరిచే పూర్వము, స్వామి ఏమిచేస్తున్నారో అని దొంగి చూచారు. స్వామివారు మిఠాయి తింటున్నారు. ఆప్టే తండ్రిని పిలిచి, స్వామి ధ్యానము అనేమిషతో ఏం చేస్తున్నాడో చూడమని కోరాడు. మోసము బట్టబయలయింది. రహస్యం బయటపడ్డ తర్వాత స్వామి ఎవరికి కనపడకుండా వెళ్ళిపోయినాడు. ఆప్టే తండ్రికి కలిగిన భ్రమ తొలిగింది. ఆయన సన్యాసము పుచ్చుకొందామనుకొన్న తన ఆలోచనకు స్వస్తి చెప్పాడు. కాని "ఆనందాశ్రమ్''కు చాలామంచి నిజమైన సన్యాసులు, తాము తీసు కొన్న ప్రమాణాలను అక్షరాల పాటించేవారు, ప్రాపంచిక విషయాలను చాలావరకు వర్జించినవారు, వివిధ శాస్త్రాలలో గొప్ప పండితులైనవారు, వస్తూ ఉండేవారు. వారిని ఆహ్వానించడానికిగాని,

గౌరవించడానికిగాని, వారివల్ల పలు విషయాలు తెలుసుకోవడానికి గాని ఆప్టేకు ఎప్పుడూ చాలా ఆనందంగా ఉండేది. అట్టి పెద్దల సమాచర్యం ఆయన్ను సంతోష పరచేది.

భారత దేశంలో చాలా భాగము ఆప్టే పర్యటించాడు. దేశం లోని శిల్ప, మత, చారిత్రిక సాంస్కృతిక సాంప్రదాయాన్ని, ప్రకృతి సౌందర్యాన్ని, సుసంపన్నమైన సాహిత్యాన్ని గమనించి మెచ్చుకొన్నాడు. దేశ భవిష్యత్తు విషయంలో ఆయనకు గొప్ప ఆశ ఉన్నది. "ఆనందాశ్రమ్"లో ఆయన నిర్వహించడానికి తాను స్వీకరించిన విధులవల్ల; రాజకీయాలు ఆయనకు ఒక ప్రధానమైన వృత్తిగా ఉండడానికి వీలులేకపోయినప్పటికీ, ఈ దేశపు పురోభివృద్ధి కార్యక్రమంలో తమ శక్తికి లోపం లేకుండా పాల్గొంటున్న వివిధ వర్గముల నాయకులనూ ఆప్టే మెచ్చుకొనేవాడు. లోకమాన్య తిలక్ అంటే ఆయనకు గౌరవము, అభిమానము.

ఆప్టేకు చిన్న పిల్లలంటే చాలా ప్రేమ. ప్రతి దినము అయన తన కుమార్తెతోను, ఇతర చిన్న పిల్లలతోను కొంత కాలాన్ని సంతోషముగా గడిపేవాడు, వాళ్లకు తమాషా కథలు చెప్పేవాడు. వాళ్లకు వినోదం కలిగించేవాడు, వారిలో ఒకడై పోయేవాడు. ఒకసారి అందరికీ మచ్చిక అయిన ఒక కోతితో పిల్లలందరూ చేరి ఆడుకొంటూ ఉండగా, అది పొరపాటున ఒక పిల్లవాని చొక్కాను పూర్తిగా చించి వేసింది. ఆ పిల్లవాడికి కూడ అది తమాషాగాను, ఆనందంగానూ ఉన్నది. ఇంటికి వెళ్ళగానే తల్లిదండ్రులు చొక్కా ఎట్లా, ఎందుకు చిరిగిందని వాణ్ణి ప్రశ్నించారు! దానికి సమాధానంగా వాడు, తాను ఒక స్నేహితుడి ఇంటికి ఆడుకోవడానికి పోగా అక్కడ

జరిగిందని చెప్పాడు. ఆ తల్లితండ్రులు వివరాలు సేకరించగా, తమ బిడ్డకు స్నేహితుడు హరినారాయణ్ ఆప్టేగారని తెలిసింది. విద్వాంసుడు, ప్రఖ్యాత రచయిత, "ఆనందాశ్రమ్" పరిపాలకుడూ అయిన ఆయన తమ కుమారునికి స్నేహితుడు అని వారు చాలా ఆశ్చర్యం పొందారు.

ఆప్టేకు కుక్కలు, ఒక జింక, చిలుకలు, మైనాగోరువంకలు, ఒక 'కాకా' పక్షి, మొదలైన చాలా పెంపుడు జంతువులు ఉండేవి. ఆ కాకా పక్షి ఆప్టే సంభాషణను పూర్తిగా అనుకరించేది. చాలా పర్యాయాలు అది పలికినప్పుడు సేవకులు ఆప్టేగారు పిలుస్తున్నారని పరుగెత్తుకొని వచ్చేవారు. తీరా చూస్తే ఆ పక్షి యజమానిని అనుకరిస్తూ పిలిచిన విషయం తెలిసేది.

1903 నుంచి 1913 వరకూ ఆయన "ఆనందాశ్రమ్"లో గడిపిన పదిసంవత్సరముల కాలము, ఆయన జీవితంలో మిక్కిలి సంతోషకరమైనదీ, అభ్యుదయంతో కూడుకొన్నదీ, ఆయనకు కీర్తిప్రతిష్ఠలను సంపాదించి పెట్టిందను. 1912 లో అకోలాలో జరిగిన మరాఠీ సాహిత్య సమావేశానికి ఆయన అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. బొంబాయి విశ్వవిద్యాలయము ఎమ్. ఎ., పరీక్షకు మరాఠీలో పరీక్షకుడుగా ఆయన ఆహ్వానింపబడ్డాడు. తరువాత విల్సన్ పేర నెలకొల్పబడిన ఉపన్యాసాల సందర్భంలో భాషా తత్త్వాన్ని గురించి ఉపన్యసించడాని విశ్వవిద్యాలయము ఆయనను ఆహ్వానించింది.

మూడో అధ్యాయము

# సాంఘిక, రాజకీయ కార్యకలాపాలు

చాలమందికి ఆప్టే ప్రసిద్ధి చెందిన సాహిత్యవేత్త అనే తెలుసు. కాని ఆయన సంఘ సంస్కర్తగా, రాజకీయవాదిగా చేసిన పనికూడ దానితో సమానంగా ముఖ్యమైనదే. నిజానికి ఆ రోజులలో గొప్ప నాయకుడైన లోకమాన్య తిలక్ ముందు ఆయన ఎక్కువగా రాణించలేదు. ప్రజలయందు గల ప్రేమ, విశాల మానవతా దృక్పథము స్వార్థత్యాగము, పరులకు సేవచేయుటయందు కోరిక, సానుభూతి ఇవన్నీ ఆయనయందు సమపాళ్ళలో ఉన్నాయి. అదృష్టవశాత్తు ఆయన చాలామందికంటె అధికంగా మంచి పరిస్థితులలో ఉన్నాడు. ఆ రోజులలో చాలమంది ప్రజాహిత కార్యకలాపాలలో పాల్గొని, అందువల్ల బీదతనానికి పాల్పడి, తమ కుటుంబాలయందు తాము నిర్వహించవలసిన విధులను నిర్లక్ష్యం చేయవలసివచ్చింది. మహారాష్ట్రియుల ఈ రోజువరకు ప్రజాసేవకులను గురించి ఒక వింత భావము ప్రజలలో ఉన్నది. ప్రజాసేవకుడు ఎంత బీదవాడైతే, ఇతరులకంటె ఎంత ప్రతికూల పరిస్థితులలో ఉంటే అంత ఉన్నత స్థానము అతనికి ప్రజలవల్ల కలుగుతున్నది. ఈ విధంగా గొప్పతనాన్ని బీదతనానికి సమీకరణం చేయడం, బహుశః, చాలా దురదృష్టకరమని చెప్పవలె. ఆప్టే భాగ్యవంతుడని చెప్పడానికి వీలులేకపోయినా, ప్రజాహిత కార్యకలాపాలలో పాల్గొనడానికి తగిన స్థితిలో ఉన్నాడు. స్వీయాభిప్రాయాలలో నిమిత్తం లేకుండా ఆయన ఎల్లప్పుడు అన్ని మంచి పనులకూ సహాయం చేస్తూనే ఉండే

వాడు. ఇదివరకే చెప్పినట్లు పూనాలో "నూతన ఆంగ్ల పాఠశాల" (New English School) స్థాపకుడైన విష్ణుశాస్త్రి చిప్‌లూణ్‌కర్ అంటే ఆప్టేకు అపరిమితమైన గౌరవము. చిప్ లూణ్‌కర్ గొప్ప ప్రజా సేవకుడు. విద్యా విషయికంగాను, ప్రజాహిత కార్యకలాపాల సంబంధముగాను మహారాష్ట్ర దేశం ఆయనకు చాలా ఋణపడి వున్నది. మంచి లాభదాయకమైన ఉద్యోగానికి రాజీనామా చేసి ఆయన ఆ పాఠశాలను స్థాపించాడు. అదే తరువాత ఫెర్గూసన్ కళాశాలగా వృద్ధిచెందింది. మరాఠీలో "కేసరి", ఆంగ్లములో "మహారాటా" పత్రికలను ప్రజాభిప్రాయ ప్రకటన సాధనాలుగా ఆయన స్థాపించాడు. గొప్ప గొప్ప భారతీయుల చిత్ర పటాలను, చౌకగా అపర్యవంతమైన పాఠ్యగ్రంథాలను ముద్రించడానికి ముద్రణాలయాన్ని స్థాపించాడు. పురాతన చారిత్రిక సంబంధమైన పాటలను, గ్రంథాలను, వ్రాత ప్రతులను ప్రకటించడం ద్వారా దేశ చరిత్ర పరిశోధనకు మార్గదర్శకుడైనాడు. ప్రభుత్వోద్యోగానికి రాజీనామా ఇచ్చి బ్రిటిషు ప్రభుత్వపు బానిసత్వానికి చిహ్నమైన రజితశృంఖలాలను వదల్చుకున్నాడు. కాని వీటి అన్నింటికన్న ఆయన చేసిన ఉత్తమమైన పని ఏమంటే, ఒక చేతిమీదుగా "నిబంధ్ మాలా" అనే పత్రికను ప్రకటించి, అందులో ఉద్రేక పూరితమైన వ్యాసాలు వ్రాసి వాని ద్వారా దేశ స్వాతంత్ర్యము కోసం పోరాడడానికి వారి శక్తిసామర్థ్యాలలో గల విశ్వాసాన్ని పురికొల్పుతూ ప్రజలలో ముమ్మరంగా ప్రచారం సాగించాడు. అటి మహామహుడు చిప్‌లూణ్‌కర్ 1882 లో చనిపోయాడు. ఆప్టే ఆయన ప్రారంభించిన కార్యక్రమాన్ని సాగించడానికి నిశ్చయించాడు. ఆప్టే, ఆయన భావాలతో ఏకీభవించిన మరి కొందరు స్నేహితులు కలిసి "నూతన్ మరాఠీ విద్యాలయమ్" అనే పేరుతో మరొక పాఠశాలను స్థాపిం

చారు. అది ఆంగ్లభాషాబోధన పాఠశాలగా 1885లో వృద్ధి చెందింది. జీతం లేకుండా గౌరవోపాధ్యాయుడుగా ఆప్టే అందులో సుమారు అయిదు సంవత్సరాలవరకు పనిచేశాడు. ఉపాధ్యాయవృత్తియందు ప్రేమ, బోధనా విషయంలో సంపూర్ణ జ్ఞానం కల ఉత్తమ ఉపాధ్యాయుడు ఆప్టే. ఆయనకు పూనాలోని ప్రభుత్వాధికారులతో గల పరిచయం ఆధారంగా, ఆ పాఠశాలకు సంభవించే పరిపాలనా సంబంధమైన, ఆర్థిక సంబంధమైన అనేక చిక్కులను పరిష్కరించడంలో ఆయన సహాయపడ్డాడు. ఆయన ప్రయత్నాలవల్లనే "నూతన్ మరాఠీ విద్యాలయమ్"కు ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని ఇవ్వవలసినదిగా బొంబాయి గవర్నరు లార్డ్ నార్త్ కోట్ సిఫార్సు చేశాడు. తరువాత ఆ ఉన్నత పాఠశాల పూర్తియైన కళాశాలగా వృద్ధి పొంది, "న్యూ పూనా కాలేజీ (New Poona College) అనే పేరుతో బొంబాయి విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఏర్పడింది. తాను చనిపోయేటంతవరకు ఆప్టే ఆ కళాశాల పాలకవర్గంలో సభ్యుడుగా ఉన్నాడు. ఫ్రెంచి, ఆంగ్ల, సంస్కృత, తదితర గ్రంథాలు పుష్కలంగా కలిగిన గొప్ప గ్రంథాలయాన్ని ఆ కళాశాలకు విరాళంగా ఇచ్చాడు.

మహారాష్ట్రానికి పితామహుడని చెప్పతగిన జస్టిస్ రానడే ప్రభావము ఆప్టేమీద ఆయన చిన్నతనం నుంచి ఉన్నది. రాజకీయాలలో మితవాది తత్త్వము ఆయననుంచే ఆప్టేకు సంక్రమించింది. గొప్ప సంఘ సంస్కర్త ఆగర్కర్‌తో కూడా ఆప్టేకు స్నేహపూర్వకమైన సంబంధాలు ఉన్నవి. ఆగర్కర్, కేసరి పత్రికను వదలిన తరువాత, స్వంత పత్రిక "సుధారక్" (స్వతంత్ర)ను స్థాపించాడు. గోఖలే కూడ ఆప్టే ముఖ్య స్నేహితులలో ఒకడు. "స్త్రీ వివాహ

వయో చట్టము" ('Age of Consent Bil') రోజులనుండి ఆప్టే సాంఘిక, రాజకీయ రంగంలో ప్రవేశించాడు. భారత దేశంలోని సంఘ సంస్కర్తలు, బాలికల వివాహ వయస్సును పెంచుతూ "స్త్రీ వివాహ వయో చట్టము" అనే పేరుతో ఒక చట్టాన్ని చేయవలసిందని దేశంలోని బ్రిటిషు ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయసాగారు. ఆ ప్రయత్నాన్ని పూర్వాచార పరాయణులు ఖండించారు. ప్రభుత్వం విదేశీ ప్రభుత్వం కనుక హిందువుల మతానికి, ఆచారాలకు సంబంధించిన విషయాలను గురించి—బాలికల వివాహ వయస్సు మొదలయిన వాటిని గురించి—చట్టాలు చేసే హక్కు లేదని పూర్వాచార పరాయణుల వాదన. ఈ వాదనను ఆప్టే ఆయన సహచరులు ఉద్రేకపూరితమైన వాతావరణంలో ఒక బహిరంగ సభలో ప్రతిఘటించారు. తరువాత కొన్ని రోజులకు సంస్కర్తలు మరొక సభను జరిపి ఈ సాంఘిక సంస్కరణకు సంబంధించి బ్రిటిషు ప్రభుత్వం చట్టం చేయడానికి అనుకూలంగా తీర్మానించారు. ఈ సభమీద పూర్వాచార పరాయణులు రాళ్ళు రువ్వారు. ఆప్టే, మరికొందరు పెద్దలు గాయపడ్డారు. కాని ఈ సంఘటన సంస్కర్తల నిశ్చయానికి స్థిరత్వం కలిగించింది. వారు "మిత్రమండల్" అనే సంఘాన్ని స్థాపించారు. ఆ సంఘ సమావేశాలలో సాంఘిక, రాజకీయ సంస్కరణలను గురించిన అనేక విషయాలు చర్చించబడి, ప్రజాందోళనా విధానము నిర్ణయించబడేది. జస్టిస్ రానడే, ప్రొఫెసర్ భాన్డార్కర్ (గొప్ప సంస్కృత పండితుడు) ఈ సంఘానికి పూర్తిగా సానుభూతిపరులు. తరువాత బొంబాయినుండి జస్టిస్ తెలంగ్ కూడా వారికి తోడయినాడు.

ఒకప్పుడు ఆగర్కర్ తన పత్రిక "సుధారక్"కు ఆప్టేను సంపాదకుడుగా చేయవలెనను కొన్నాడు. కాని పిమ్మట ఆ పదవికి

శ్రీ సీతారామ్‌పంత్ దేవ్‌ధర్‌ను ఎన్నుకొన్నారు. "అనంతాశ్రమ్"కు సంబంధించిన బరువైన బాధ్యతలు, "సుధారక్" వారపత్రిక సంబంధమయిన కార్యభారము అదివరకే ఆప్టే పై ఉండడమే అందుకు కారణము. 1912 లో "సుధారక్" ఇంచుమించుగా కొన ఊపిరితో ఉన్నప్పుడు, అది మరికొన్ని నెలలు నడవడానికి వీలుగా ఆప్టేవారికి సహాయపడ్డాడు.

1895 లో భారత జాతీయ మహాసభలో అతివాద, మితవాద వర్గాల మధ్య తీవ్రఘర్షణ ఏర్పడింది. ప్రతి సంవత్సరము జాతీయ సభ సమావేశముతోపాటు జరుపబడే సంఘ సంస్కరణ సమావేశాన్ని ఆయేడు అక్కడ జరిపితే సభా మంటపాన్ని తగల పెడతామని అతివాదులు బెదిరించారు.

ఈ కాంగ్రెసుసభ సమావేశ సమయంలో "కాంగ్రెస్ సమాచార్" అనే పేరుతో ఒక పత్రిక ఆప్టే సంపాదకత్వంలో ప్రచురించబడ్డది. ఆ కాంగ్రెసు సమావేశ విజయానికి ఆయన దీక్షాపూర్వకంగా కష్టపడి పని చేశాడు.

లోకమాన్య తిలక్ నాయకత్వం క్రింద అతివాదులు పూనాలోని "సార్వజనిక్ సభ"ను స్వాధీనపరచుకొన్నప్పుడు, జస్టిస్ రానడే ఒక పోటీ సంఘ సంస్కరణ సంస్థను ప్రారంభించారు. గోఖలే అప్పుడు లండన్‌లో ఉన్నందువల్ల ఆ సంస్థకు ఆప్టే సహాయ కార్యదర్శిగా నియమించబడ్డాడు. అందువల్ల ఆయన జస్టిస్ రానడేకు చాలా సన్నిహితుడయినాడు అది కారణంగా. 1896 లో మహారాష్ట్రంలో వచ్చిన కరువు కాలంలో రైతుల స్థితిగతులకు సంబంధించ

చిన లెక్కలను సేకరించే పనిని ఆయన ఆప్టేకు ఒప్పగించారు. వానిని గురించి ఆప్టే తయారు చేసిన నివేదిక గొప్పగా ఉన్నదని అందరూ మెచ్చుకొన్నారు.

గోఖలే లండన్‌లో వుండగా, 1897 లో మన దేశంలో ప్లేగ్ జాడ్యం వ్యాపించ నారంభించింది. రోగులను వేరుచేసి వారిని దూరంగా తీసుకొని వెళ్ళడం, రోగ లక్షణాలు పూర్తిగా నిర్మూలించబడినవని నిర్ధారణ అయిందాకా వారిని దూరంగా ఉంచడం, మరి ఇతర పద్ధతుల ద్వారా బ్రిటిషు ప్రభుత్వంవారు ఈ జాడ్యాన్ని అరికట్టడానికి ప్రయత్నించారు. ఈపని యావత్తూ పూనాలో సైన్యానికి ఒప్పగించబడ్డది. బ్రిటిషు సైనికులు ఘోరమైన దురంతాలు చేశారు. వారు అవలంబించిన అవినీతికరమైన, క్రూరమైన, అనాగరకమైన పద్ధతులవల్ల పూనా ప్రజలలో విపరీతమైన క్రోధభావము కలిగింది. నిరాధారులైన అమాయక స్త్రీలపై ఆ సైనికులు జరపిన అత్యాచారాలపట్ల కోపాగ్ని ప్రజ్వరిల్లగా చాలమంది నాయకులు వాటిపై బహిరంగ ప్రకటనలు చేశారు. ఈ విషయాన్ని సవివరంగా గోఖలేకు తెలియ పరిచిన వారిలో ఆప్టే కూడా ఒకడు. నాయకుల ప్రకటనలు తప్పు అంటూ ప్రభుత్వం ప్రకటనలను చేయగా వాటిని ఖండిస్తూ లండన్‌లోని ఇండియా కార్యదర్శికి డక్కన్ సభ తరపున అనేక ఉత్తరాలు పంపబడ్డాయి. గోఖలే లండన్‌నుంచి రాగానే ఆయనకు అందచేసే ఉద్దేశంతో తిలక్ కూడా ఈ దురంతాలను రుజువు చేస్తూఉన్న సాక్ష్యాన్ని సేకరించాడు. గోఖలేను కలుసుకోవ డానికి ఆయన బొంబాయి వెళ్లాడు. కాని బొంబాయి చేరగానే ఆయన్ను ప్రభుత్వం అదుపులోకి తీసుకొన్నది. తను రక్షించుకోవ

దానికి వీరు సేకరించిన సాక్ష్యాన్ని ప్రభుత్వం నాశనం చేసింది. తాను ఏమీ సాక్ష్యాన్ని ప్రదర్శించలేక పోయినందువల్ల, గోఖ్లే రానడే సలహా మీద లండన్‌లోని బ్రిటిషు ప్రభుత్వానికి క్షమాపణ చెప్పుకొన్నాడు. అందుకు ఆయనను అతివాదులు తీవ్రంగా విమర్శించారు. ఆ విమర్శ గోఖ్లేకు చాలా కష్టం కలిగించింది. గోఖ్లే యొక్క పరాభవానికి తాను కూడా కొంతవరకు కారణమని ఆప్టే భావించి, రెండు సంవత్సరాల తరువాత గోఖ్లే ఇండియాకు రాగానే దక్కన్ సభ కార్యదర్శి పదవిని ఆప్టే ఆయనకు ఒప్పగించాడు.

పూనాలోని ముఖ్యులైన పౌరులు కొందరు మితవాద సంఘము (Liberal Union) అని ఒక సంఘంగా ఏర్పడి ప్రతి దినము రాజకీయాలను గురించి చర్చిస్తూ ఉండేవారు. ఆ చర్చలకు ఆప్టే కూడా హాజరవుతూ ఉండేవాడు. పూనాలో ఉన్నప్పుడు జస్టిస్ రానడే కూడ వారిని కలుస్తూ ఉండేవాడు. ఇటువంటి చర్చల ఫలితంగానే 1905 లో గోఖ్లే "భారత సేవక సంఘము"ను స్థాపించాడు. ఈ "మితవాద సంఘము" మసానిక్ లాడ్జ్ (Masonic Lodge) పద్ధతిలో ఏర్పాటు చేయబడ్డది. "కరమాణుక్"కు తోడు జ్ఞాన్ ప్రకాశ్" అనే పూనా దిన పత్రికకు కూడా 1883 నుండి 1894 వరకు ఆప్టే సంపాదకుడుగా ఉన్నాడు. ఆ రోజులలో అది ఆంగ్ల-మరాఠీ పత్రికగా ఉండేది. ఆంగ్ల భాగానికి ఆప్టే సంపాదకుడు. 1894 లో ఆప్టే మద్రాసు కాంగ్రెసు సభలకు హాజరయి సింహళానికి కూడ వెళ్ళాడు. జ్ఞాన్ ప్రకాశ్" పత్రికను సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ 1906 తీసుకొనేవరకూ ఆ పత్రిక ఆఫీసు వ్యవహారాలను ఆప్టే అజమాయిషీ చేశాడు. ఇన్ని సంవత్సరాలూ ఆయన ఏమీ ప్రతి ఫలం లేకుండానే పనిచేశాడు.

పూనాలో ప్లేగు వ్యాధి వ్యాపించి ధ్వంసము చేసిన రోజులలో ఆప్టే చేసిన సేవ ప్రశంసనీయమైనది. చిరకాలము జ్ఞాపకముంచుకో తగినది, సాహసోపేతమైనది. ఆ అంటు వ్యాధి అంతులేని తీవ్రతతో వ్యాపించింది. అనేకమంది జనం చనిపోయినారు. మొదట అది బొంబాయిలో కనిపించింది. అక్కడనుండి ప్రజలు గుజరాత్ కు, మహారాష్ట్రకు పారిపోగా, ఆ వ్యాధి ఆ యా ప్రాంతాలకు అంతటా వ్యాపించింది. చనిపోయిన తరువాత శవాలను తీసి పారవేయడానికి ఆప్టే తన వ్యక్తిగతమైన సేవను స్వచ్ఛందంగా సమర్పించడమే కాకుండా తనకు సహాయం చేయడానికి పలుగురు సేవకులను కూడా నియమించుకొన్నాడు. లోకమాన్య తిలక్ మొదలైన పెద్దలచే ప్రారంభించబడిన ప్లేగు హాస్పిటల్ లో విధ విరామంలో లేకుండా ఆయన పని చేశాడు. అప్పుడు ఆయన చాలామంది స్నేహితులకు పరిచర్య చేశాడు. ఆ రోజులలో అప్పుడప్పుడు సాయంత్రం వేళల మాత్రమే ఇంటికి వచ్చేవాడు. "ఆనందాశ్రమ్" బాధితులందరికీ క్షేమంగా సేవ చేసింది. చాలా కుటుంబాలవారు పూనానుంచి వెళ్ళిపోవలసి వచ్చినప్పుడు తమ విలువగల వస్తువులను "ఆనందాశ్రమ్"లో ఉంచి వెళ్ళేవారు. ఆప్టే స్నేహితుడు మాధవ్ రావ్ జోషీ ఈ ఘోరమైన వ్యాధిలో చనిపోయాడు. ఆప్టే ఆయనను విడువకుండా పరిచర్య చేశాడు. బొంబాయి ప్రభుత్వము ఆయన చేసిన మానవసేవను గుర్తించి ఆ సేవకు చిహ్నంగా ఆయనకు "కైజర్-ఇ-హింద్" (Kaiser-i-Hind) పతకాన్ని బహూకరించింది. ఈ ఆపద సమయంలో చాలా దిక్కులేనివారికి "ఆనందాశ్రమ్" ఒక అనాథ బాల శరణాలయం అయింది. ఇలా బహుకాలం జరగడానికి వీలు లేనందువల్ల, ఈ అంటు వ్యాధి రోజులలో బాధలకు గురి అయిన వారికోసం, ఆప్టే ఆయన స్నేహితులు కలిసి ప్రత్యేకంగా

ఒక అనాథ బాల శరణాలయాన్ని స్థాపించారు, ఆప్టే. ఎల్. ఆర్. గోఖ్లే లిరువురూ ఆ శరణాలయానికి చాలసంవత్సరాలవరకు సంయుక్త కార్యదర్శులుగా ఉన్నారు.

1901 లో ప్రభుత్వము ఆప్టేను పూనా పురపాలక సంఘ సభ్యుడుగా నియమించింది. అప్పటినుంచి పూనా పురపాలక సంఘానికి ఆప్టే అనేక హోదాలలో సేవచేశాడు. కాని ఎన్నిక తంత్రాంగంలో చివరివరకూ ఆరితేరక పోవడంవల్ల, పౌరసేవలో చివర దశలో ఆయన పురపాలక సంఘ అధ్యక్షుడి ఎన్నికలలో ఓడి పోయాడు. అయినప్పటికీ, పురపాలక సంఘంలో ఆయన చాలా ఉపయోగకరమైన పనిచేశాడు. విఖ్యాతి ప్రసిద్ధి చెందిన సర్. ఎమ్. విశ్వేశ్వరయ్య, జి. కె. గోఖలేవంటి నియమిత సభ్యులతో కలిసి ఆయన పనిచేశాడు. పూనాలో, చెడు స్థితిలో ఉన్న మురికినీరు పారుదల పద్ధతిని బాగుపరచి, మంచి స్థితిలోకి తీసుకొని రావడానికి సహాయపడ్డాడు. పూనా పురపాలక పాఠశాలా సంఘములో ఆయన 13 సంవత్సరములు సభ్యుడుగా ఉన్నాడు (అందులో 6 సంవత్సరములు అధ్యక్షుడు), పూనాలోని శిశు మరణాలను గురించి ఒక నివేదిక తయారు చేయించాడు, పురపాలక వస్తు ప్రదర్శనశాలను పునర్నిర్మాణము చేశాడు, ఎడ్వర్డు రాజు స్మారక వైద్యాలయాన్ని స్థాపించాడు, ఆలంది దేవాలయపు పరిపాలనా సంఘ సభ్యుడుగా పనిచేశాడు (ఆలంది దేవాలయము పూనాకు దగ్గరగా ఉన్నది. మహారాష్ట్ర దేశపు ప్రఖ్యాత భక్తుడు - కవి జ్ఞానేశ్వర్ సమాధి అక్కడ ఉన్నది). డఫరిన్ ఫండు అనే నిధి వసూలుకు సహాయపడ్డాడు (ఈ నిధినుండి దాదుల (Nurses) గా శిక్షణ పొందడానికి సహాయం లభిం

చేది), ఇన్‌ఫ్లుయంజా హాస్పిటలు స్థాపించి అందులో పనిచేశాడు. 1918 లో ఇన్‌ఫ్లుయంజా అంటువ్యాధి వ్యాపించినప్పుడు), ఇంకా అనేకములైన (ఈ చిన్న గ్రంథములో చెప్పడానికి సావకాశము లేనన్ని) ప్రజాహిత కార్యాలలో పాల్గొన్నాడు, పౌర వ్యవహారాలలో గొప్ప నాయకుడు, మానవ సేవాపరాయణుడు, ధైర్యము విజాయతీ కలిగి విధ్యుక్త ధర్మము బాగుగా తెలిసిన ప్రజాసేవకుడు ఆప్టే.

భారత జాతీయ మహాసభ మితవాదుల చేతులలో ఉండగా, దానికి అనుబంధముగా రాష్ట్రీయ సమావేశాన్ని 1915 లో పూనాలో జరపవలెనని ఆప్టే మొదటిసారిగా ప్రేరేపణ చేశాడు. దాని ఆహ్వాన సంఘానికి అధ్యక్షుడుగా ఆయనే ఎన్నిక అయినాడు. 1907 లో సూరత్ గందరగోళము తరువాత మితవాదుల రాష్ట్ర సమావేశాలు అప్పటివరకు జరుగలేదు. ఈ మధ్యకాలంలో గోఖలే పరమ పదించాడు. ఆరోగ్యం సరిగా లేని కారణంచేత దాదాభాయ్ నౌరోజీ, ఫిరోజ్ షా మెహతా ఎక్కువ శ్రద్ధగా పాల్గొనలేకపోయినారు. జహంగీర్ మన్‌జీ వాడియా, బొంబాయి గవర్నరు లార్డ్ విల్లింగ్ డన్ ఈ సమావేశానికి హాజరయినారు. ఈ సమావేశానికి హాజరయిన ఇతర పెద్దలు మహాత్మాగాంధి, సర్ నారాయణ్ చందావర్కర్, సర్ ఇల్లూభాయ్ సామల్‌దాస్, శ్రీ సమర్థ, శ్రీ ఆర్. పి. పరాంజ్‌పే, ప్రొఫెసర్ ఆర్. జి. భాన్‌డార్కర్ మొదలైనవారు. భారత జాతీయ మహాసభ సమావేశాలకన్నింటికీ ప్రతినిధిగానో, ప్రేక్షకుడుగానో ఆప్టే హాజరు అయ్యేవాడు. స్త్రీలు ఈ రాంటి సమావేశాలలో పాల్గొనడాన్ని ప్రోత్సహించడానికి తగిన ప్రయత్నం చేసి

వాడు. ఆయన స్వయంగా శ్రీమతి కాశీబాయి కానిట్కర్ వంటి స్త్రీ ప్రతినిధులుగా ఎన్నుకోబడేటట్లు చూశాడు. ఆ రోజులలో జరిగే కాంగ్రెసు మహాసభలకు సంబంధించిన పని యావత్తూ ఆయన తెర వెనుక ఉండి పూర్తిచేయించేవాడు. కాంగ్రెసు సభ ఆశయాలను మహారాష్ట్ర ప్రజలలో ప్రచారం చేయడానికి, అమలు పరచడాని అవసరమయిన కృషిలో ఆయన పూర్తిగా పాల్గొన్నాడు.

భారత సాంఘిక సభను ఆప్టే పూర్తిగా బలపరిచాడు. దాని అన్ని సమావేశాలకు హాజరయినాడు. కాని 'ఆనందాశ్రమ్'లో ఆయనకున్న భారమైన పనివల్ల, ఆశ్రమ నిత్యమాల మూలకంగా ఏర్పడిన హద్దులవల్ల, సాంఘికసభ ఆశయాలకొరకు ఎక్కువగా పని చేయలేకపోయినాడు. తన ఉపన్యాసాల ద్వారా, తన సాంఘిక నవలల ద్వారా సంఘ సంస్కరణ భావాలను ప్రజలలో ప్రచారం చేసి అవి ప్రజలలో వ్యాపించడానికి శాయశక్తుల ప్రయత్నించాడు. ఆయనవంటి చురుకైన, నిరాడంబరమైన ప్రజాసేవకుల ప్రయత్నాల వల్ల మహారాష్ట్రము ఈ విషయాలలో చాలా ముందంజ వేసింది. పూనాలోని భారత బాలికల ఉన్నత పాఠశాలా సంఘములో సభ్యుడుగా ఆప్టే చాల సంవత్సరాలు పనిచేశాడు. (చారిత్రిక సంబంధాల వల్ల దీనిని ప్రజలు సామాన్యంగా "హుజూర్ పాగా" అని పిలిచేవారు).

ఆయనకు మరాఠీ సాహిత్యసంఘములో సన్నిహిత సంబంధమున్నది, దానిప్రతి సమావేశానికి హాజరయినాడు. అకోలాలో 1912 లో జరిగిన సాహిత్య సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

జాతీయ భారత సంఘము ఈ సంఘము అంతర రాష్ట్రీయ సామరస్యాన్ని నెలకొల్పడానికి ఏర్పడ్డది—మరికొన్ని ఇతర సంఘాలలో ఆయన చేసిన నిరంతరమైన ప్రజాసేవను గురించి ఇక్కడ వివరించడం కష్టము. కాని రాయల్ ఏషియాటిక్ సొసైటీ, బొంబాయి విశ్వవిద్యాలయాలతో ఆయనకుగల సంబంధాన్ని మాత్రము మనము చెప్పుకోవాలి. పూనా మద్యపాన నిషేధ సంఘములో ఆయన చేసిన సేవకూడా విస్మరించరానిది.

స్వభావంచేత ఆప్టే స్నేహ పాత్రుడు, సాధువు. ఆయనకు చాలామంది స్నేహితులున్నారు. స్నేహితులయందు మిక్కిలి భక్తి శ్రద్ధలు కలిగి ఉండడమనేది ఆయన ఉత్తమ లక్షణము. ఆయన వారి కొద్దిపాటి గుణములు సహితము మెచ్చుకొనేవాడు. సంఘములోని వివిధ స్థాయిలలోను ఆయనకు మిత్రులున్నట్లు మనకు కనపడుతుంది. కొందరు ఆయనకు కళాశాలలో సన్నిహిత మిత్రులు, మరికొందరు ఒకరొకరి హాస్య సంభాషణలను, పద్య రచనలను చదవడానికి, వినడానికి ఒకచోట కులాసా కాలక్షేపం కొరకు చేరేవాళ్ళు. వీరిని పాపులర్ క్లబ్ అనేవారు. ఆప్టే, సవర్ణ్ షీరుష్కరు ఆ క్లబ్‌లో కొత్త పుస్తకాలను చదవడం, వాటిమీద చర్చలు జరపడంలో రాత్రులకు రాత్రులు గడిపేవారు. మరొక వర్గము స్నేహితులు రావ్ సాహెబ్ కానిట్కర్, రానడే (జ్ఞానచక్షు సంపాదకుడు), ఠాకూర్, ఆప్టేలు కలిపిన వర్గము. ఈవర్గ సభ్యుల చర్చల ఫలితంగానే "మనోరంజన్" మాసపత్రిక ఆరంభమైంది. మూడో వర్గము ప్రఖ్యాత మరాఠీ విద్వాంసుడు విష్ణుశాస్త్రి చిప్లూణ్కర్ స్మారకార్థము ఒకచోట చేరే వారితో కూడుకొన్నది.

"ఆనందాశ్రమ్"లోని ఆప్టే గృహము పలువురు మిత్రులను ఆకర్షించేది. అది నగర మధ్యంలో ఉన్నందువల్ల నలుగురూ చేరడానికి వీలుగా వుండేది. అందరికీ అక్కడ మంచి ఆతిథ్యము దొరికేది. ఈ స్నేహితులందరూ రోజుకొక్క పర్యాయమైనా కేంద్రస్థానంగా ఉండే ఈ ప్రదేశంలో చేరేవారు. శ్రద్ధతో సాహిత్య చర్చలు జరపడం వారి నిత్యకృత్యంగా ఉండేది. ఈ మాసంలో ఆయన స్నేహితులైన కానిట్కర్ దంపతులు కూడా ఈ అంతరంగిక సమావేశాలలో పాల్గొనేవారు. ఇక్కడ సమావేశమయ్యే స్నేహితులందరూ ఒకే రకమైన సాంఘిక, రాజకీయ అభిప్రాయాలు కలవారు. ఆప్టే స్నేహితులను బాగా ఆదరించేవాడు. ఈ వర్గము అప్పుడప్పుడు ఇతర స్నేహితుల గృహములవద్ద కూడా సమావేశమై చర్చలు సాగించేది. అటువంటి ప్రదేశాలలో మాధవ్ రావ్ జోషి గృహము ఒకటి. ఉదయం పూట పార్వతీదేవి ఆలయానికి వాహ్యాళికి వెళ్లి తిరిగి వస్తూ త్రోవలో అక్కడ తేనీటి సమావేశం జరిపేవారు. ఆ రోజులలో బజారులో కొన్న రొట్టె, బిస్కట్లు తినడం పూర్వాచార పరాయణుల చేత గర్హింపబడుతూ ఉండేది. మత పవిత్రతను గురించి వారికున్న కఠిన నియమాలవల్ల ఈ పని వారి కోపానికి గురి అయ్యేది. కాని జోషిగారింట్లో మాత్రం, ఆ నిషేధింపబడిన రొట్టె, బిస్కట్లనే వారు తేనీటితో బాటు పుచ్చుకొనేవారు. పూనా క్యాంప్ (Foona Camp) లో రొట్టెను, బిస్కట్లను మామూలుగా సరఫరాచేసే దుకాణము ఉండేది.

ఒకసారి ప్రొఫెసర్ పానసే ఈ తేనీటి సమావేశానికి రాని సమయంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఆప్టే ఆయనకు

ఒక గూఢముగా వ్రాయబడిన చీటీ పంపాడు. "సుజ్ఞ దీక్షిత్ మఠంనుంచి "స్వామి" మాధవ్ రావ్ ఇంటికి వచ్చారు. బటూ (కొత్తగా మత దీక్ష పుచ్చుకొన్నవాడు) కూడా వచ్చాడు", మన వర్గంలోని ఇతరులంతా వచ్చారు. కాబట్టి మీరువచ్చి 'స్వామి' వారి దీక్షము పుచ్చుకోవలసిందిగా కోరుచున్నాను" అని అందులో ఆప్టే వ్రాశాడు. పాన్‌సేగారింటిలో ఆ చీటిని ఆయన తండ్రి తీసుకొన్నాడు. క్రొత్తగా ఒక "స్వామి" వచ్చారని, వారి పవిత్రమైన దర్శనం చేసుకోవచ్చునని ఆ వృద్ధునికి సంతోషం కలిగింది. వెంటనే ఆయన స్నానంచేసి తయారయినాడు. ఇంతలో పాన్‌సే ఇంటికి వచ్చాడు. గ్రామంలో ఉంటూ ఎప్పుడైనా పట్టణానికి వచ్చిన తనవంటి వాళ్లకు పూజ్యుడైన ఒక స్వామి దర్శనం చేసుకునే అదృష్టం కలగడం ఒక అపురూపమైన సదవకాశమని తండ్రి పాన్‌సేతో సంతోషముగా చెప్పాడు. పాన్‌సే పెద్ద చిక్కులో పడ్డాడు. కాని వెంటనే తేరుకొని తాను ముందువెళ్ళి ఆయన రావడానికి తగిన సమయాన్ని నిర్ణయించుకొని వస్తానని తండ్రితో చెప్పి పాన్‌సే వెళ్ళాడు. అక్కడికి వెళ్ళిన తరువాత ఆ గూఢమైన చీటిని భక్తిపరుడైన తన తండ్రి అమాయకంగా ఏ విధంగా నమ్మిందీ ఆయన స్నేహితులకు వివరించి చెప్పాడు. పాన్‌సేకు కలిగిన క్లిష్ట పరిస్థితికి స్నేహితులంతా విరగబడి నవ్వారు. పాన్‌సే ఇంటికివెళ్లి "స్వామి"వారు కొద్దిసేపే ఉండి అప్పుడే వెళ్లిపోయారని, అటువంటి సదవకాశం కోసం మరి కొంత కాలము వేచి ఉండవలసి వస్తుందని తండ్రికి చెప్పాడు. ఆ "స్వామి"ని తాను దర్శించే అదృష్టం లేకపోయినందుకు ఆ వృద్ధ భక్తుడు ఎంతగానో పరితపించాడు.

ఆ రోజులలో ప్రసిద్ధ వ్యక్తుల మీద సహితము ఈ మత విషయకమైన ఆంక్షలు, నిషేధాలు ఏవిధంగా పనిచేసేవో ఈ సంఘటన వల్ల మనకు బాగా ద్యోతకమవుతుంది. గోఖలే చాలా గొప్ప వ్యక్తి. ఆప్టేకు ముఖ్య స్నేహితుడు. కాని ఆప్టేకన్న రెండు సంవత్సరాలు చిన్న. వారిద్దరూ స్నేహితులు కావడానికి, వారిద్దరికీ జస్టిస్ రానడే యందు గొప్ప గౌరవ భావము ఉండడం, వారిద్దరూ ఆయనకు సహాయకారులు కావడమే కారణాలు. గోఖలే నియమంగా "ఆనందాశ్రమ"కు తానుగా వచ్చేవాడు, కాని ఇతర స్నేహితుల గృహాలకు ఆయన వెళ్ళినట్లు కనపడదు. వారిద్దరికీ గల సామాన్య రాజకీయ దృక్పథమే వారి స్నేహ బంధానికి కారణము. భారత జాతీయ కాంగ్రెసులో మితవాద భావాన్ని ఆప్టే పూర్తిగా ఆమోదించాడు. అందువల్లనే గోఖలే ఆయనతో మిక్కిలి స్నేహంగా ఉన్నాడు. వారిరువురి మధ్య జరిగిన అంతరంగిక సంభాషణలలో ఒకదాని యదార్థ నివేదిక మనకు లభ్యమైనది. గోఖలే తానొక "మంత్రివర్గ" సభ్యునిగా దేశానికి సేవచేయడానికి ఇష్టపడుతున్నట్లూ, ఆప్టే తానొక ప్రఖ్యాత నవలా రచయిత కాగోరుతున్నట్లూ చెప్పారని దానివల్ల మనకు తెలుస్తుంది.

గోఖలే ఆప్టేతో మితవాద రాజకీయాలను గురించి మాట్లాడడమే కాకుండా, షేక్స్పియర్‌పై విమర్శకు సంబంధించిన కొన్ని సమస్యలమీద కూడా చాలాసార్లు చర్చిస్తూ ఉండేవాడు. ఆంగ్ల, ఫ్రెంచి, సంస్కృత భాషా గ్రంధాలతో విస్తారంగా పరిచయం కలిగి ఉన్న కారణంచేత ఆప్టే ఈ చర్చలలో ఉపయోగకరమైన విధంగా పాల్గొన కలిగేవాడు. ఫ్రెంచి భాషలో ప్రొఫెసర్‌గా

ఫెర్గూసన్ కాలేజీ ఆప్టేగారి సేవలను పొందవలెనని గోఖ్లే అభిలషించాడు, కాని ఏదో నిబంధనల సంబంధమైన చిక్కు ఆటంకము కలిగించింది. ఆప్టేను బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ కు సభ్యుడుగా ఎన్నిక చేయించవలెనని గోఖ్లేకు కోరిక కలిగింది. 1903 లో ఆప్టే అభ్యర్థిగా నిలబడడానికి అంగీకరించాడు. ఈయనకు ప్రత్యర్థిగా నిలబడిన ఎన్. సి. కేల్కర్ తిలక్ వర్గానికి చెందినవాడు. (రాజకీయ) నేరానికి శిక్షింపబడినవాడనే కారణంచేత కేల్కర్ అభ్యర్థిగా నిలబడడానికి అర్హత లేదని బొంబాయి ప్రభుత్వము నిర్ణయించింది. చట్టము పేరుతో కావలెనని కేల్కర్ కు జరిగిన ఈ అన్యాయానికి ఆప్టే చాల బాధపడ్డాడు. ఆప్టే వ్యతిరేకులు - పట్టుదలే ప్రధానంగా కలవాళ్ళు - ఈ అన్యాయం జరగడానికి ఆప్టేయే కారణభూతుడని ఆయనను నిందించారు. అంతేకాని వారు ఆప్టే యొక్క విశాలమైన, దేశభక్తి పూరితమైన మనసును అవగాహన చేసుకోలేదు.

'మీ' అనే నవలలో ఆప్టే వర్ణించిన భవానంగుని సంస్థయే తరువాత గోఖ్లేచేత 1905 లో స్థాపించబడిన "సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ" గా రూపొందిందని తెలుసుకొన్నప్పుడు పాఠకునికి చాలా విచిత్రంగా ఉంటుంది. గోఖ్లే చనిపోయే ముందు చివరసారిగా ఆయనను దర్శించినవాడు ఆప్టేయే. 1915 ఫిబ్రవరి 14న ఆప్టేను చూడవలెనని ఆయనకు గోఖ్లే ప్రత్యేకంగా కబురు పంపాడు. చివరి మాటలు ఆప్టేతోనే మాట్లాడాడు. ఈ సంఘటననుబట్టి వారిద్దరి మధ్యగల ప్రేమానుబంధము మనకు ద్యోతకమవుతుంది.

మరొక విచిత్రమైన స్నేహ సంబంధమును కూడ ఉదహరించ తగినదే. అది పూనాలోని చిత్రశాల ప్రెస్‌కు చెందిన శ్రీ వాసు కాకా జోషీ, ఆప్టేకు మధ్యనున్న స్నేహము. జోషి పూర్తిగా తిలక్ అనుయాయుడు. ఆప్టే మితవాద వర్గానికి చెందినవాడు కాని తన చారిత్రిక నవల "సూర్యోదయ"ం వారిద్దరి మధ్య ఉండే నిస్వార్థమైన, వాస్తవికమైన స్నేహానికి చిహ్నంగా ఆప్టే జోషికి అంకిత మిచ్చాడు.

నాగపూర్‌కు చెందిన శ్రీహరి మహాదేవ్ పండిట్ ఆప్టేకు మరొక ముఖ్య స్నేహితుడు. పండిట్ "దేశసేవక్" పత్రిక సంపాదకుడు. సమాజోద్ధారక రచయిత. సంఘ సంస్కర్త. ఆప్టే తన నవల "మీ"ను తమ స్నేహ చిహ్నంగా పండిట్‌కు అంకిత మిచ్చాడు. సంఘ సంస్కారమును ప్రోత్సహించే వారిలో చాలామంది ఆప్టేకు స్నేహితులు. ప్రసిద్ధి చెందిన లాయర్లు సర్ మోరోపంత్ వి. జోషీ, నాగపూర్‌కు చెందిన రావ్ బహద్దర్ రంగ్ రావ్ మధోల్కర్, మరి కొందరు రాజకీయవాదులు కూడ ఆయనకు స్నేహితులు. హెచ్. ఎస్. పండిట్ అనే ఆయన కాంగ్రెసువాది, బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిలుకు గుజరాత్ నుండి ఎన్నికైన సభ్యుడు, మితవాద నాయకులంటే మిక్కిలి గౌరవం కలవాడు. ఆయన తరుచుగా ఆప్టేను బొంబాయిలోను, పూనాలోను కలుసుకొని రాజకీయాలను గురించి, సంఘ సంస్కారమును గురించి చర్చిస్తూ ఉండేవాడు విద్యావేత్త, ప్రసిద్ధ గ్రంథకర్త అయిన రావ్ బహదుర్ మోరేశ్వర్ మహాజని, ఆప్టేను ఎక్కువగా మెచ్చుకొనేవాడు. సాహిత్యంలో ఆప్టేయొక్క స్థానాన్ని అతనే మొదట గుర్తించాడు. ఆప్టే గ్రంథాలను మెచ్చుకోడమే కాకుండా, ఆయన ఆప్టేకు ఉపయోగకరమైన సలహాను

ఇస్తేవాడు. ఆయనను మెచ్చుకొని తరుచూ ఆయనను కలుసుకొనే మిత్రులు ఇంకా ఎందరో ఉన్నారు. ఆప్టే చేసిన ప్రజాసేవకల్లకూడా ఆయనకు చాలామంది స్నేహితులు అయ్యారు. 1897 లో పూనాలో ప్లేగ్ వ్యాధి వ్యాపించినపుడు రావ్ సాహెబ్ వి. ఎ. పట్‌వర్ధన్, ఆప్టే కలిసి స్వచ్ఛంద సేవకులుగా పనిచేశారు. వారిద్దరు పూనా పురపాలక సంఘ సభ్యులుగా ఉన్నప్పుడు డఫరిన్ ఫండు అగ్రెనెకేషన్‌కు సంయుక్త కార్యదర్శులుగా పనిచేసి సన్నిహితులయినారు. పట్‌వర్ధన్ చాలకాలము "ఆనందాశ్రమ్"కు ఒక ధర్మకర్తగా ఉన్నాడు. హీరాబాగ్ బాల అనాధ శరణాలయంలోను, పూనా పురపాలక సంఘంలోను పనిచేయడంతో ఎల్. ఆర్. గోఖ్లే, ఆప్టే సన్నిహితులయినారు. పూనా పురపాలక సంఘంలో పనిచేయడం వల్ల రావ్ బహాదుర్ రామ్ నారాయణ్ అమర్‌చంద్, హనమంత్ రామ్ రామనాథ్, సేఠ్ మాడీవాలేవంటి మరి కొందరు కూడా ఆప్టేకు మిత్రులయినారు. వీరందరు "ఆనందాశ్రమ్"కు తరుచుగా వస్తూ ఉండేవారు.

ఆప్టేకు సన్నిహిత పరిచయమైన వారిలో మరొక వర్గము వారున్నారు. వారు పూనాలోని ప్రభుత్వ కచ్చేరీలకు చెందినవారు. మొదట వారందరూ రావ్‌బహాదుర్ వాడ్ గారింటివద్ద కలుసుకొంటూ ఉండేవారు. కాని ప్లేగ్ వ్యాధితో 1899 లో ఆయన మరణించిన పిదప వారందరూ "ఆనందాశ్రమ్"కు వస్తూ ఉండేవారు.

మహారాష్ట్రంలో ఉన్న జాగీర్‌దార్‌లు, చిన్న సంస్థానాధిపతులలో ఔంధ్ (సతారా జిల్లా) సంస్థానాధిపుడు శ్రీమంత్ బాలాసాహెబ్ పంత్ ప్రతినిధి, ఇఛల్‌కరన్‌జీ (కొల్హాపూర్)కు చెందిన

శ్రీమంత్ బాబా సాహెబ్, ఘోర్పడే ఆప్టేకు చాలా సన్నిహితంగా ఉండేవారు. వీరిలో మొదటివారు రచించిన చిత్రాలు మహాభారత విమర్శ గ్రంథానికి అలంకార ప్రాయంగా వున్నాయి. కళకు, సాహిత్యానికి చెందిన అనేక విషయాలపై ఆయన ఆప్టేతో చర్చిస్తూ ఉండేవాడు. రామాయణ, మహాభారతాలలో ఆయన వ్రాసిన చిత్రాలలోని పాత్రల దుస్తులు ఆప్టే సూచించినవే. ఈ రెండు పురాణాల మీద విమర్శలను పూనాలోని ఒక ప్రచురణ కర్తకొరకు ఆప్టే అప్పుడు వ్రాశాడు. అందువల్ల ఆప్టేకు ఈ పురాణాలలోగల సంపూర్ణ జ్ఞానముయొక్క ముద్ర బాలాసాహెబ్ పంత్ గారి వర్ణచిత్రాలలోని పాత్రల దుస్తులు (జుట్టు ఉండవలసిన పద్ధతితో సహా) అలంకారాలు, తలపాగలు, ఆయుధాలు, బాణాలు వీటన్నింటి పైన ఉన్నది. రెండవ వారైన బాబా సాహెబ్ ఘోర్పడేగారికి ఉత్తమ సాహిత్యం మీద ఎక్కువ అభిమానము. కళలలోను, సాహిత్యంలోను వచ్చిన నూతన పద్ధతులన్నింటిలో ఆయనకు శ్రద్ధ, అభిరుచి ఉండేవి. మహారాష్ట్రంలో పురాతన పద్ధతులు పోయి నూతన పద్ధతులు రావడానికి, సాంఘిక, రాజకీయ కారణాలకంటె, ఆప్టే వ్రాసిన నవలలే ప్రధాన కారణమని ఆయన తమాషాగా అన్నాడు.

కానిట్కర్ దంపతులైన రావ్ సాహెబ్ గోవింద్ రావ్, ఆయన భార్య కాశీతాయ్, వీరిరువురికీ ఆప్టే చాలా సన్నిహిత మిత్రుడు. శ్రీమతి కానిట్కర్ తన గ్రంథాన్ని రచించడానికి ఆమెను ఆప్టే ఎంతగా ప్రోత్సహించాడో ఇదివరకే తెలుసుకొన్నాము. ఒక సోదరియందు చూపవలసిన గౌరవాన్ని ఆప్టే ఆమెయందు చూపేవాడు. ఆ రోజులలో స్త్రీలు విద్యనభ్యసించడం చాలా కష్టంగా ఉండేది.

ఇతరులకల్లా ఈ విషయంలో స్త్రీలకు ప్రోత్సాహం రావడం ఇంకా కష్టంగా ఉండేది. కాని ఆప్టే మాత్రము స్త్రీలు విద్యాగంధులు కావలెనని, దేశపురోభివృద్ధిలో వారు తమ పాత్రను పూర్తిగా నిర్వహించవలెనని ఎక్కువగా కోరేవాడు. ఆ కారణంచేత, విద్య నభ్యసించవలెనని దేశ పురోభివృద్ధిలో తమ పాత్రను తాము నిర్వహించవలెనని స్త్రీల కందరికీ సహాయ పడడానికి ఆప్టే సిద్ధంగా ఉండేవాడు. కానిట్కర్ దంపతులకూ ఆయనకూ మధ్య సన్నిహిత స్నేహము వృద్ధి పొందడానికి అదే కారణము. ఒకనాటి కాశీతాయి కానిట్కర్ ఆప్టేను కలుసుకోవడానికి వచ్చింది. అప్పుడు ఆయన జి. కె. గోఖ్లేతో ఏదో చర్చిస్తూ ఉన్నాడు. కాశీతాయి ఇంటికి తిరిగి వెళ్ళదామని అనుకొంటున్నది. ఆ సమయంలో, ఆమె వచ్చి కింద వేచి ఉన్నదని ఆయనకు తెలిసింది. వెంటనే ఆయన దిగివచ్చి ఆమెను కలుసుకొని క్షమాపణ చెప్పుకొన్నాడు. తాను ఎంత పనిలో ఉన్నప్పటికీ, కాశీతాయి కానిట్కర్ వచ్చిందంటే మాత్రము, ఆమెను వెంటనే లోపలికి తీసుకొని రావలసిందని ఆయన సేవకులకు ఆజ్ఞాపించాడు. తన స్నేహితుడైన మాధవ్ రావ్ భార్య పార్వతీబాయ్ జోషీయొక్క క్షేమాన్ని గురించి ఎంతో అతిశ్రద్ధ చూపేవాడు. ఆమెను ఎల్లప్పుడూ సోదరిగా ఆదరించాడు. మాధవ్ రావ్ మరణానంతరం ఆమెను గురించి ఆమె బిడ్డలను గురించి తగు శ్రద్ధ తీసుకొన్నాడు.

ఇతరులతో స్నేహము చేయడానికి సంపదగాని, పదవిగాని ఆప్టేకు అడ్డంకులు — ఏవీ కావు. గోఖ్లే అనే సహాధ్యాయుడు ఆయనకు దగ్గర స్నేహితుడు. ప్రసిద్ధులైన మిత్రులను గౌర

పించిన విధంగానే ఆయనను కూడా ఆప్టే గౌరవించేవాడు. చాలా కాలం జీవితంనాటి స్నేహితుడొకడు తాను చనిపోతూ తన సోదరుణ్ణి తన మాదిరిగానే చూడవలసిందని ఆప్టేను కోరాడు. అందుకని, ఆయన రంగోపంత్ అతేను ఎక్కువ శ్రద్ధతో కనిపెట్టి ఉన్నాడు. అతని చనిపోయిన సోదరుడు ఏవిధంగా ప్రేమించేవాడో, అతన్ని అంత ప్రేమతోనూ ఆదరించాడు.

పూనాలో ఉన్న ఆంగ్లేయులలో కూడా కొందరు ఆప్టేకు దగ్గర స్నేహితులు. వారు సర్ క్లాడ్ హిల్, మిస్టర్ మాంట్‌ఫర్డ్, మిస్టర్ రాబర్ట్‌సన్, సర్ జేమ్స్ డ్యూబోల్, మిస్టర్ స్పిక్, ఫాదర్ లివింగ్‌టన్, మిస్టర్ కీటింగ్, మిస్టర్ కిన్‌కెయిడ్ మొదలయినవారు. అందులో చివర వారిరువురికి, ఆప్టేకు మిక్కిలి స్నేహము. ఒకసారి ఒక వారం రోజులు ఆప్టే మిస్టర్ కిన్‌కెయిడ్‌కు అతిథిగా ఉన్నాడు. ఆ వారం రోజులు వారు మహారాష్ట్ర చరిత్రను గురించి, ఇరువురికీ అభిమానమున్న ఇతర విషయాలను గురించి చర్చించారు. బొంబాయి గవర్నర్ విల్లింగ్‌డన్ ప్రభువుకు కూడా ఆప్టే అంటే అభిప్రాయం ఉండేది. ఈ ఆంగ్ల స్నేహితులతో గల సంబంధాలవల్ల, అనేక పనులు సానుకూలం కావడానికి, అనేక చిక్కులు పరిష్కరించడానికీ, ఎందరో ప్రజల బాధలను సులభంగా నివారించడానికీ కృషి చేశారు.

బాలబాలికలంటే ఆప్టేకు చాలా ప్రేమ. మిక్కిలి సంతోషంతో వాళ్ళ మాటలు వింటూ, వాళ్లతో మాట్లాడుతూ ఉండేవాడు. వాళ్ల మధ్య ఉన్నప్పుడు ఆయనకు చాలా ఆనందంగా

ఉండేది. వాటికోసం పద్యాలు వ్రాసేవాడు. ఒకసారి ఒక చిన్న పిల్లవాణ్ణి తనతో కలిసి భోజనం చేయడానికి తన ఇంటికి ఆప్టే ఆహ్వానించాడు. వాడు ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులతో తనను తన స్నేహితుడు 'హరి' మరునాటి రోజు భోజనానికి పిలిచాడని చెప్పాడు. ఈ 'హరి' ఎవరా అని వాడి తల్లిదండ్రులు విచారించి చివరకు వారి కుమారుడి స్నేహితుడు ప్రఖ్యాత గ్రంథకర్త హరినారాయణ్ ఆప్టే అని తెలుసుకొని చాలా ఆశ్చర్యపడ్డారు. ఆప్టే తమకు స్నేహితుడు అనే విశ్వాసాన్ని ఆయన చిన్న పిల్లలలో కలిగించాడు. పలుబడి సంవత్సరాలు పెద్ద అయినప్పటికీ పిల్లలు ఆయనవద్ద స్నేహితులవలె కాలక్షేపం చేయగలిగేవారు.

నాలుగో అధ్యాయము

# సంఘ సంస్కర్త

19 వ శతాబ్దపు చివర కొన్ని దశాబ్దాలలోను, 20 వ శతాబ్దపు మొదటి దశాబ్దాలలోను మహారాష్ట్రంలో ఉత్సాహ పూర్వకమైన సాంఘిక, రాజకీయ పరివర్తనలు అకస్మాత్తుగా జరగడం ప్రారంభించాయి. అదివరకు ఎరుగనటువంటి సాంఘిక, రాజకీయ పరివర్తనల సుడిగుండంలో హిందూ సంఘము పడిపోయింది. హిందూ సంఘంలోని ఆచారాలను కులభేదాలను ఆధారం చేసుకొని క్రైస్తవ మత ప్రచారకులు హిందూ సంఘాన్ని తీవ్రంగా విమర్శించ నారంభించారు. ప్రజోపయోగకరమైన కొన్ని చట్టాలను చేయడం ద్వారా ప్రభుత్వ యంత్రాంగం కూడా సనాతనాచారపు పునాదులను కదలించడానికి జరిగే ప్రయత్నానికి దోహదం చేసింది. విల్లు ద్వారా ఆస్తిని సంక్రమింపజేసే చట్టము వాటిలో ఒకటి. పశ్చిమ భారత దేశములో, ఉత్తమాశయాలతో తీవ్రభావ విప్లవాన్ని తీసుకొని రావడానికి ముందుకు అడుగువేసిన వారిలో ముఖ్యులు జస్టిస్ రానడే, జస్టిస్ తెలంగ్, ప్రసిద్ధ సంస్కృత పండితుడు ఆర్. జి. భాన్‌డార్‌కర్, ప్రిన్సిపల్ అగర్కర్, స్వామీ దయానంద్, జ్యోతిబాఫులే. వీరు, హిందూ సంఘంలో జరిగే అన్యాయాలను అసంఘము గుర్తించేలాగు చేయడానికి; కులము, అస్పృశ్యత, స్త్రీల నిరాశ్రయస్థితి వీని విషయంలో సంఘంలో గల ఆదర్శాలకు, ఆచరణలకు గల పరస్పర వ్యతిరేకతను, సంఘంలో వారికి (కొన్ని కులముల వారికి,

అస్పృశ్యులకు, స్త్రీలకు) ఉన్న నీచస్థితిని హిందూ సంఘము గుర్తించేలాగున చేయడానికి వారు నిరంతరమైన కృషి చేశారు. నూతనంగా నాగరికాచారంగా సంఘంలో ప్రబలిన త్రాగుడు అనే దురాచారాన్ని, పూర్వంనుంచీ ఉన్నత కుటుంబాలని చెప్పబడే వారిలో ఉన్న వ్యభిచారమనే దురాచారాన్ని తీవ్రంగా విమర్శించారు. ఆప్టే పట్టుదలగల దేశభక్తుడు, ఉద్రేక పూరితుడైన సంఘ సంస్కర్త. యౌవన దశలోనే ఆయనకు జస్టిస్ రానడేతో పరిచయం కలిగింది. అప్పటినుంచీ సంస్కరణ విషయంలోను, నూతన రాజకీయ భావాల విషయంలోను ఆయన పురోగాములైన యువకులతో చేతులు కలిపాడు. తన చుట్టూ ఉన్న సంఘంలోని దురాచారాలను, ఇతర సమస్యలను తన నవలలో కూలంకషంగా చర్చిస్తూ వాటి ద్వారా ఆయన ప్రచారం సాగించాడు. ఈ సమస్యల కన్నింటికి పరిష్కారాలను కూడా ఆయన వాటిలో సూచించాడు.

అవిభక్త కుటుంబ విధానంలోని లోపాలు, స్త్రీల అజ్ఞానము - వారికి విద్యావశ్యకత. బాల్యవివాహము, వధూవరుల వయస్సులో ఎక్కువ తేడాగల వివాహము, వయస్సు మీరినవారి వివాహము, విధవా పునర్వివాహము, విధవా కేశ ఖండనము, పతిత స్త్రీ జనోద్ధరణము మొదలైన సాంఘిక సమస్యలపై చర్చలు ఆయన నవలలో ఉన్నాయి. సంఘాన్ని మేల్కొల్పడానికి ఆప్టే, అగర్కర్ వలె కొరడాను ఝుళిపించలేదు. మంచి సలహాలనిచ్చే కార్యకలె, ఆయన తన నవలలలోని పాత్రల ద్వారా చక్కని సలహాలిస్తాడు. తీవ్ర ఘాతాలవలె ఉండే అగర్కర్ వ్రాతలకంటెను, ప్రసిద్ధ వ్యాసకర్త "లోకహితవాది" (గోపాల్ రావ్ దేశ్‌ముఖ్) తీవ్ర విమర్శలకంటెను, పాఠకులపై సంఘ సంస్కరణ విషయంలో

ఆప్టేకు గల ప్రభావము చాలా ఎక్కువని ఇప్పుడందరూ అంగీకరిస్తున్నారు. ఉదాహరణకు "గోపాల్ రావ్" అనే నవలలో వైవాహిక జీవితంలోని సుఖ సంతోషాలు, అతిబాల్య వివాహాలవల్ల కలిగేకీడు, విధవా పునర్వివాహ సమస్య, స్త్రీ విద్య, కుల భేదాలవల్ల, మూఢ నమ్మకాలవల్ల కలిగే చెడు, ఇవన్నీ చర్చించబడ్డాయి. ఆయన మరో నవల "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" అనే దానిలో కుటుంబంలో ఉండే వారి పరస్పర సంబంధాలు, అప్పటి స్త్రీల స్థితి, అవిభక్త కుటుంబము, మతాన్ని గురించిన మూఢాభిప్రాయాలు, కృత్రిమ నీతి పద్ధతులు ఇవన్నీ ఆప్టే చర్చించాడు. "భయన్ కర్ దివ్య", "కర్మ యోగ్" అనే నవలలో విధవా పునర్వివాహం చేసుకొన్న స్త్రీలు ఇరువురిని గురించి, వారు ఏ విధంగా మంచి గృహిణులు, మంచి తల్లులుగా ఉన్నారో వర్ణించాడు (విధవలుగా ఉన్నప్పుడు వారు చెడు నడత గలవారుగా ఉంటారని ఆ రోజులలో సామాన్యంగా ఉండే దురభిప్రాయాన్ని ప్రతిఘటిస్తూ ఆయన వ్రాశాడు). విధవలు తిరిగి వివాహం చేసుకోవడానికి సంఘము అంగీకరించని పక్షంలో భార్యను కోల్పోయినవారు కూడా తిరిగి వివాహం చేసుకోవడానికి సంఘం ఏ మాత్రం అంగీకరించకూడదనే ఆప్టే అభిప్రాయము. ఈ అభిప్రాయం చాలా తర్కయుక్తమైనది. కాని, మొత్తంమీద, వివాహం వ్యక్తిగత విషయమనీ, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఏ న్యాయ సూత్రము, ఏ చట్టము ఈ విషయంలో వర్తించనేరదనీ మనం జ్ఞాపక ముంచుకోవాలి. ఆప్టే ద్వితీయ వివాహము, జస్టిస్ రానడే ద్వితీయ వివాహము ఇందుకు ఉదాహరణలు. ఆప్టే విధవను వివాహం చేసుకోలేకపోయినాడు – కారణమేమంటే, అలా జరిగిన పక్షంలో, ఆయన పూర్వాచార పరాయణులైన తన కుటుంబ సభ్యులతో సంబంధాలు పూర్తిగా తెగకొట్టుకోవలసి రావడమే కాకుండా,

"ఆనందాశ్రమమ్"ను కూడా వదలి పెట్టవలసి వచ్చేది—దీనినిబట్టి, ఒక న్యాయసిద్ధమైన, తర్కయుక్తమైన సూత్రము కూడా, కొన్ని వ్యక్తిగతమైన, భావోద్రేక సంబంధమయిన విషయాలలో వర్తించడానికి వీలుండదని రుజువు అవుతోంది. బాలికా వివాహ వయో చట్టాన్ని గురించి ఆరోజులలో దేశమంతటా తీవ్రమైన వాదోపవాదాలు జరుగుతున్నాయి. ఆప్టే ఈ బిల్లుకు పూర్తిగా అనుకూలుడు. బాలికల వివాహ వయస్సును 8 నుండి 14 లేక 16 సంవత్సరాలకు పెంచడానికి ఈ బిల్లులో ఏర్పాట్లున్నాయి. తమ కుమార్తెలకు 16 సంవత్సరాలలో పునః వివాహాలు చేయము అని మిత్రమండలి సభ్యులందరిచేత ప్రమాణ పత్రాలమీద ఆప్టే, గోఖలేలు సంతకాలు చేయించారు. ఆప్టే పెత్తండ్రి మాత్రము ఈ సూత్రానికి వ్యతిరేకంగా ఉన్నాడు. బాలికల వివాహ వయస్సును పెంచవలెనన్న వాదనను సంఘ సంస్కర్తలు రాజకీయమైన దానిని గా చేశారు. ఇదివరకే ఈ దేశాన్ని జయించిన కారణంగా, సాంఘిక, మత విషయాలలో చట్టాలను చేసే కొన్ని అధికారాలు పరప్రభుత్వం చేతులలోకి వెళ్ళి పోయాయి. ఈ విషయంలో ఇంకా మరికొన్ని అధికారాలను పర ప్రభుత్వానికి ఇవ్వడానికి చాలమంది ఇష్టపడలేదు. సంస్కర్తలు మాత్రము ప్రభుత్వమే ఇట్టి చట్టాన్ని చేయవలెనని కోరారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 1890 నవంబరులో ప్రభుత్వానికి పంపిన "కోర్కెల పత్రము"మీద ఆగర్కర్ వంటి సంఘ సంస్కర్త కూడా సంతకము చేయలేదు. దానిమీద సంతకము చేసిన వలసైన మందిలో లోకమాన్య తిలక్ మొదటివాడు. తరువాత ఆప్టే మొదలైన పూనా ప్రముఖులున్నారు. ఈ "కోర్కెల పత్రము"మీద సంతకాలు చేసిన వారిలో సంఘ సంస్కర్తలేగాక, పూర్వాచార పరాయణులుకూడ ఉన్నారనేది గమనించవలసిన విషయం. ఆలోచనల

లోనూ, ఆచరణలోను కూడా ఆప్టే గొప్ప సంస్కర్త. సుమారు నలభై అయిదు సంవత్సరాల ప్రజాహిత జీవితంలో, సంఘ సంస్కరణ సంబంధమైన అన్ని ప్రతిపాదనలను ఆయన ఆమోదించి ప్రతిపాదించాడు. కాని "ఆనందాశ్రమ్" మత సంబంధమైన ధర్మసంస్థ కావడంచేత, అక్కడ ఆయన చేయవలసిన కార్యకలాపాలవల్ల సాంప్రదాయ సిద్ధమైన కొన్ని కట్టుబాట్లను ఆయన అంటిపెట్టుకొని ఉండవలసి వచ్చింది. అందువల్ల పూజలు, పండుగలు, గృహ దేవతారాధన, సోమవారాలలో శివ ప్రీత్యర్థం ఉపవాసాలు, శివరాత్రి తదితర మత సంబంధమైన విధులన్నీ ఆయన మనస్ఫూర్తిగా ఆచరించేవాడు. ఆ కారణంగా ఆయన అందరకూ ప్రీతి పాత్రుడైనాడు. అంత మాత్రము చేత ఆయనకు మతాచారాల విషయమై ప్రత్యేకమైన, వివేక విశిష్టమైన అభిప్రాయాలు లేవని కాదు. ఈ విధుల నిర్వర్తించడంలో, కీర్తిశేషులైన పెత్తండ్రి, తల్లిదండ్రులు, ఇతర బంధువులు మానవుని ఆధ్యాత్మిక లాభానికి ఏయే పనులు అవసరమని తలిచారో, వానిని గౌరవించి ఆచరణలో పెట్టాడు. తనకు సంస్కరణాభిప్రాయాలున్నప్పటికీ, "ఆశ్రమ్" స్థాపకుడైన తన పెత్తండ్రికి ఇచ్చిన వాగ్దానాన్ని భంగపరచలేకపోయినాడు. ఆయన వ్రాసిన "కర్మయోగ్", "అజాచ్" ఇంకా ఇతర నవలలనుండి ఆయనన్ను తెలుసుకోవచ్చు. కలలు, పునర్జన్మ, భగవత్ప్రేరణలలో ఆయనకు విశ్వాసమున్నది. కాలిరిడ్ ఆంగ్ల సాహిత్యంలో ఉపయోగించనట్లు, ఆప్టే ఈ పద్ధతు లన్నింటినీ తన నవలలలో ఉపయోగించాడు. ఆయన భక్తి పరాయణుడు. కుమార్తెకు సంబంధించి తీర్చవలసిన మొక్కుబడులు, ఆమె క్షేమం కోసం, శ్రద్ధగా తీర్చాడు. ఆయా సందర్భాలలో, పవిత్రమైన పట్టు వస్త్రాలను ఆచారం కోసం కాక పరిశుభ్రతకోసం, పవిత్రతకోసం ఆయన ఉపయోగించేవాడు. ఒక వ్యక్తి,

తన కుటుంబ బంధువులకూ, తదితర ప్రజాసామాన్యానికి మనఃక్లేశము కలిగించరాదు అనేదే ఆయన అభిప్రాయము.

థియాసఫీ సిద్ధాంతాన్ని అవలంభించినవారు, ప్రార్థనాసమాజ్ అనుచరులు, జనులను మోసగించడం మాత్రమే పనిగాగల కృత్రిమ గురువులు - వారి శిష్యులు ప్రచారం చేసే భావాలనూ, వింతగా ఉండేవారి ఆచారాలను ఆప్టే విమర్శించేవాడు. మరాఠీలో రామదాస స్వామి దాసబోధ్, తుకారామ్ అభంగాలు (భక్తి గీతాలు), జ్ఞానేశ్వరి (భగవద్గీతకు జ్ఞానేశ్వర్ మరాఠీలో వ్రాసిన భాష్యము), భగవద్గీత, ఉపనిషత్తులు, వేదాంత గ్రంథాలు అంటే ఆప్టేకు చాలా ఇష్టము. క్రైస్తవ మతాన్ని, బైబిల్ గ్రంథాన్ని, అందులో ఉండే పిడివాదపు వాదనలను విమర్శించేవాడు. కాని వాటిలో ఉన్న మానవ సేవా పద్ధతులకు వాటిని గౌరవించేవాడు. "కర్మయోగ్"లో చంద్రశేఖర్ పాత్ర బహుశః ఆప్టేయొక్క మత విషయక భావాలను తెలియ పరుస్తుంది. విక్టోరియా యుగపు ప్రజల భావనా స్థితిలో భగవద్విషయకమైన సంశయం ఉండేది. అది టెన్నిసన్ మొదలయిన విక్టోరియా యుగపు కవులు, నవలా రచయితల రచనలో కనపడేది. అదే అప్పుడప్పుడు ఆప్టే నవలలలో కూడా కనపడేది. కాని ఆయన స్వకీయాభిప్రాయం మాత్రము "చంద్రశేఖర్" వ్యక్త పరుస్తాడు. ఆ నవలలో. సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు. సుఖ స్వరూపుడు. సర్వ ప్రపంచ నియామకుడు అయిన భగవంతుడు ఉన్నాడనే తన విశ్వాసము అని "చంద్రశేఖర్" అంటాడు. ఆ రోజులలోని ఆ దరు విద్యావంతులవలెనే ఆప్టేకూడ భగవంతుణ్ణి చేరే రూఢమయిన మార్గాన్ని గురించి ఒక నిశ్చయానికి రాలేకపోయి ఉంటాడు. రాజకీయ, సాంఘిక సంస్కరణలపై ఆయన అభిప్రాయాలు, ఆ సంస్క-

రణాల ప్రాముఖ్యం "శివ్‌రామ్‌పంత్" అనే పాత్ర చెప్పిన మాట లలో మనకు వ్యక్తమవుతాయి. ఆ రెంటి మధ్య హెచ్చు తగ్గులు లేవని, దేశ క్షేమం కోసం ఆ రెంటికీ సమాన ప్రాధాన్యత ఉండవలె నని ఆ పాత్ర అంటుంది. భారత దేశ క్షేమము విషయంలో ఆస్టే అభిప్రాయాలు మనకు "మీ" అనే నవలలో భగవానంత్ "మతము"ను బట్టి వెలుస్తుంది. అందులో "ఆంద్" పాత్రలో దేశ క్షేమాన్ని గురించి సూత్ర ప్రాయంగా ఈ విధంగా దృఢపరచడం జరిగింది—"దేశ క్షేమమే నా మతము, దేశస్వాతంత్ర్యమే నా స్వర్గము". ఈ సూత్రము, తర్వాత రోజులలో గోఖ్లే స్థాపించిన "సర్వెంట్సు ఆఫ్ ఇండియా సంఘము" యొక్క ఆదర్శాన్ని పోలి ఉన్నది. భారత దేశములో బ్రిటిషువారి రాజకీయాలను గురించి ఆస్టేకు స్పష్టమైన అభి ప్రాయాలున్నాయి వాటిని ఆయన "అజాచ్"లో ఆంగ్లేయుడైన పోలీసు సూపరిన్‌టెన్‌డెన్‌టుకు పద్మాకర్‌కు జరిగిన సంభాషణలో విశదీకరించాడు. ఆ పోలీస్ అధికారి "మీరు మీ సంస్థలను సదభి ప్రాయంతో నే స్థాపించారు. కాని బ్రిటిషు ప్రభుత్వము మాత్రము అవన్ని తమ శ్రేయస్సుకు వ్యతిరేకమైనవే అని భావించి తీరతారు. అందుచేత వారు తీవ్రమైన రాజకీయాల - అనగా బ్రిటిషు ప్రభుత్వపు వ్యతిరేక రాజకీయాల ఆచరణను ఏ మాత్రము సహించరు" అంటాడు.

1913 ఫిబ్రవరి 19 న ఆయన సమార్తె మరణము ఆయనకు పెద్ద దెబ్బ. చాల విచారంలో మునిగి, భార్యతో కూడ ఆయన లోనవ్‌లాలో కొద్ది రోజులున్నాడు. పూనాలో మాదిరే అక్కడ కూడా అనేకులు ఆయనను చూడడానికి, దుఃఖ సమయంలో సాను భూతి తెలపడానికి వచ్చేవారు. అచల్లని ప్రదేశంలో ఆయన ఒక్క పోసుకున్నాడు. ఆయనకు దుఃఖోపశమనం కలిగించడానికి ఆయన

తండ్రికూడ అక్కడనే ఉన్నాడు. వారు పూనాకు తిరిగి రాగానే ఆయన భార్యకు జబ్బుచేసింది. కాని అదృష్ట వశంగా అది మలేరియా మాత్రమేనని తెలింది. కుమార్తె మరణంవల్ల కలిగిన దుఃఖముతో చాల రోజులవరకు ఆయన భోజనం కూడ సరిగా చేయలేకపోయివాడు. ఆ గదిలోకి పోవడానికి ధైర్యము చేయలేక పోయేవాడు. ఆ దుఃఖము చాల రోజులవరకు తగ్గలేదు. ఆమె బ్రతికి ఉన్నప్పుడు ప్రక్కన బొమ్మతో కుమార్తెను ఫోటో తీయించి దాని అడుగు భాగంలో "ఆమెకు ఆనందం - మాకు కూడాను" అని వ్రాశాడు. ఆమె పోయిన పిదప మిక్కిలి దుఃఖముతోను, బాధతోను ఆ ఫోటోను చూస్తూ కూర్చుండేవాడు. ఆమె పోయిన సంవత్సరం వరకు ఆమె జ్ఞాపకార్థము సోమవారాలు భోజనం మానివేశాడు. ఆయన దుఃఖముయొక్క ప్రభావము ఆయన రచనపైన కూడా కనిపించింది. ఆ విచారకరమైన సంఘటన తిరువాత చెప్పుకో తగిన రచన ఏదీ ఆయన చేయలేదు. వ్రాద్దామని కూర్చుండేవారు కాని కలం సాగేదికాదు. ఆయనకు జీవితంలో ఆనందమే పోయింది. ఆశాభంగం, నిస్పృహ ఆయనను ఆవరించినయి. కుమార్తె పోయేటప్పటికి "కర్మయోగ్" నవల "కరమణూక్" ధారావాహికంగా ప్రచురింపబడుతూ ఉన్నది. అది కూడా చివరకు పూర్తికాకుండానే ఆగిపోయింది. తన మానసిక వ్యధను ఆ పత్రిక 15-3-1913 సంచికలో ఆయన "ఒక కల" అనే వ్యాసంలో వర్ణించాడు.

1914 లో మతాదాయ సంస్థల మహాసభ కోసం ఢిల్లీ వెళ్ళినప్పుడు ఆయన చాల బలహీనంగా ఉన్న కారణాన సోమవారాలు తిరిగి భోజనం చేయవలసిందిగా భార్య ఆయనను కోరి ఒప్పించగలిగింది. ఆమెతోకూడ హర్ద్వార్, లక్ష్మణ్ఝూలా, మథుర, బృందా

వన్, ఆగ్రా, ఉత్తర హిందూస్థానంలోని ఇతర ప్రదేశాలకు విశ్రాంతికోసం, దుఃఖోపశమనం కోసం ఆయన వెళ్లాడు, కాని ప్రయోజనం లేకపోయింది. పూనాకు తిరిగి రాగానే ఆయన మరల జబ్బుపడి రెండు మాసాలలో నవాలాంగా గడిపాడు. ఆహారలోపం వల్ల ఆయన బాధపడుతున్నాడే తప్ప మరేం లేదని వైద్యులు చెప్పారు. క్రమంగా ఆయన మరికొంత ఆహారం తీసుకోవడం ప్రారంభించాడు. 1914 చివరి భాగంలో ఆయన తండ్రి నానా సాహెబ్ జబ్బుపడ్డాడు. ఆప్టే రాత్రింబవళ్లు ఆయనకు సేవచేశాడు. కాని ఆయన ఆరోగ్యం క్రమంగా క్షీణించి 1915 ఫిబ్రవరిలో చనిపోయినాడు. అదే సంవత్సరం అదే మాసంలో గోఖలే కూడా మరణించాడు. అందువల్ల ఫిబ్రవరి మాసం అంటే ఆప్టేకు భయం వేసి పోయింది. తన వెంట సాధ్యమైనంతవరకు ఎవరైనా తోడు ఉంటే బాగుండు నని పించి, ఆయన తన సన్నిహిత బంధువులను తనవద్దకు పిలిపించుకున్నాడు. ఆయన మేనత్తకూడా తన బిడ్డలతో వచ్చి "ఆనందాశ్రమ్"లో ఉన్నది. ఈ బంధు జనమంతా వచ్చి ఆయనకు తోడుగా ఉన్నప్పటికీ ఆయనకు ఊరట కలుగలేదు. అందువల్ల ప్రజాహిత జీవితంలో ఎక్కువగా శ్రద్ధతీసుకోవలెనని ఆయన నిర్ణయించుకొన్నాడు.

1915లో బొంబాయి రాష్ట్రీ కాంగ్రెసు సభల ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా ఆయన ఎన్నుకోబడినాడని ఇదివరకే చెప్పాము. దీనితో కొంతకాలము గడిచింది. ఆ సంవత్సరము సెప్టెంబరు మాసంలో ఆయన పూనా పురపాలక సంఘాధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆ తరువాత ఆయన పురపాలక సంఘ కార్యక్రమాలలో ఎక్కువ కాలం గడిపాడు. ఆ సంవత్సరంలోనే, విల్సన్ భాషా తత్త్వశాస్త్రోపన్యాసాలు ఇవ్వవలసిందిగా బొంబాయి విశ్వవిద్యా

ఆయం వారు ఆయనను ఆహ్వానించారు. ప్రాకృత భాష అభివృద్ధి, సంస్కృత నాటకాలలో దాని ఉపయోగము; మహారాష్ట్రీయ ప్రాకృత - మరాఠీ భాష సంబంధము, ఆ తర్వాత జ్ఞానేశ్వర్ కు పూర్వము, తరవాత ఉన్న మరాఠీ సాహిత్యము అనే విషయాలను గురించి మూడు ఉపన్యాసాలు ఇచ్చాడు. ఆ ఉపన్యాసాలు సామాన్యాభిప్రాయాలను మాత్రమే తెలిపినవిగాని, భాషా తత్వశాస్త్ర విషయికంగా చూస్తే అంత తృప్తికరంగాలేవు.

1916 అక్టోబరు 21 వ తేదీన రాష్ట్ర కాంగ్రెసు సభ శ్రీ జిన్నా అధ్యక్షతన అహ్మదాబాద్ లో సమావేశమయింది. శ్రీ గోఖలే సూచనల ప్రకారము తయారు చేయబడిన రాజకీయ సంస్కరణల చిత్తు ముసాయిదాను జిన్నా ఆ సమావేశం ముందు ఉంచాడు. ఆ చిత్తు ముసాయిదాను తయారు చేయడంలో ఆప్టేకున్న పాలు ఎక్కువ. ఈ సమావేశము తరువాత ఆయన ఎన్నో కాంగ్రెసు సమావేశాలకి హాజరయినాడు. ఆ తరువాత తన జీవితాంతం వరకు లోకమాన్య తిలక్ రాజకీయాలను బలపరిచాడు.

1916 ఆగష్టులో ఆయన నవలలు "యశ్వంత్ రావ్ ఖరే", "మీ" ఈ రెండు ప్రచురింపబడినవి. రెండవ నవలకు సమాప్తం నాలుగు విధాలుగా ఉండేటట్లు వ్రాశాడు. వాటిలో ఆయనకు ఎక్కువ అభిమాన పాత్రమయినదే ఇప్పుడు ఆ నవల చివర ఉన్నది. (రెండవ రకమయిన సమాప్తము బొంబాయినుండి వెలువడే మాస పత్రిక "మనోరంజన్"లో 1919లో ప్రచురితమయింది). "యశ్వంత్ రావ్ ఖరే"కు వ్రాసిన పీఠికలో, అసంపూర్తిగా ఉన్న "అజాచ్", "కర్మయోగ్" అనే రెండు నవలలను పూర్తిచేయు

తలెననే సంకల్పమున్నట్లు ఆయన తెలియ పరచాడు. "మీ" అనే నవలలో ఆయన 1870 నాటికి ఉన్న మానసిక ఆశయాలను (ఆయన దానిని వ్రాసే నాటికి ఇరువది సంవత్సరాలకు పూర్వము) గురించి పొందు పరచాడు. ఆ ఆశయాల విషయంలో ఆయనమీద కీ॥ శే॥ విష్ణుశాస్త్రి చిప్లూణ్కర్ యొక్క ప్రభావము పూర్తిగా కనపడు తుంది. 1916 లో ఆయన బొంబాయి విశ్వవిద్యాలయము సెనెట్ సభ్యుడుగా ఎన్నికైనాడు. ప్రజా జీవితంలో ఆయన ఆశించిన ఆశయాలు పూర్తిగా ఫలించాయి. తన కార్యకలాపాలు నన్నింటినీ ఇక ముగింపు చేద్దామనే ఆలోచన కలుగ నారంభించింది. దానికి అను గుణంగా మొదట "కరమణూక్" ప్రచురణను ఆపివేశాడు. తన ఉత్తమ చారిత్రిక నవల "వజ్రఘాత" అనే దాని ప్రచురణ ఆ పత్రికలో పూర్తిచేసి ఆ పైన ఆ పత్రిక ప్రచురణను ఆపివేశాడు. ఆయన శక్తి సామర్థ్యాలు పూర్తిగా ఉడిగిపోయినవి. 1890 నుండి ఆయన సాగించిన ప్రశంసనీయమైన సాహిత్య కృషి అనే నాటకానికి చివర అంకము వ్రాయ నారంభించాడు. ఆయన పరిచయులలో జోషీవంటి వారు ఆయన మంచి తనాన్ని తమ స్వార్థానికి బాగా ఉపయోగించు కొన్నారు. బెంగాల్ లోని తిస్తా - కురిగ్రామ్ - చిల్ మారీ రైల్వే శాఖయొక్క షేర్లను అమ్మిపెట్టడానికి ఆయన అంగీకరించడం - ఇతరులకు మేలుచేయడానికి ఆయన సిద్ధముగా ఉండడంవల్ల కలిగిన ఫలితమే. జోషీగారకు, ఆప్టే, తుదివరకు, ఈ షేర్లను గురించి ప్రచారం చేసి, వాటిని అమ్మిపెట్టడానికి అనేక ప్రాంతాలలో తిరుగుతూనే ఉన్నాడు.

1918 ఏప్రిల్ 27 న పూనా కిర్లోస్కర్ నాటకశాలలో ఒక సమావేశం జరిగింది. ఢిల్లీలో జరిగే "యుద్ధ సమావేశం" లో

పాల్గొనడానికి ప్రజాప్రతినిధికి సావకాశ మివ్వకపోవడానికి సంబంధించిన బ్రిటిష్ ప్రభుత్వ విధానాన్ని గురించి ప్రజలలో గల ఆందోళనను తెలుపడానికి ఆ సమావేశము ఏర్పాటయింది. ఒక వంక ప్రజల సానుభూతిని పోగొట్టుకొంటూ, వేరొక వంక యుద్ధ ప్రయత్నానికి సాయము చేయవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం ప్రజలను కోరింది. ఆ సభకు అధ్యక్షుడుగా ఆప్టే పేరును లోకమాన్య తిలక్ ప్రతిపాదించాడు. మన దేశానికి స్వయం నిర్ణయాధికారము ఇచ్చే విషయంలో బ్రిటిష్ వారి అభిప్రాయాలను గురించి తనకు అనుమానాలు ఉన్నాయని లోకమాన్యుడు ఆ సభలో చెప్పాడు. ఆ సభలో బారిస్టర్ భూస్‌వాలా, ప్రొఫెసరు లిమయే కూడా మాట్లాడారు. లక్నో ఒడంబడికను అనుసరించి అప్పటినుంచి ఆప్టే పూర్తిగా తిలక్‌ను సమర్థించసాగాడు. కాని శ్రీనివాసశాస్త్రి, ఆర్. పి. పరాంజపే, మరికొందరు మితవాదులు ఈ అభిప్రాయాలతో ఏకీభవించలేదు. శ్రీ శాస్త్రి, మాంటేగు చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలపట్ల తన తృప్తిని వెలిబుచ్చి, అవి స్వీకరింపదగినవే నన్నాడు. పూనాలో జరిగిన ఈ పై సమావేశంలో, రాష్ట్రాలలో నైనా ఈ సంస్కరణలవల్ల స్వయం పరిపాలన ఎలా లభ్యం కావడం లేదో ఆప్టే తన అధ్యక్షోపన్యాసములో వివరించాడు. ఈ సందర్భంలో జరిగిన వింత ఏమిటంటే, సభాధ్యక్షుడు ఆప్టేకు అభినందనలు తెలుపడానికి లేచి నిలబడిన ఆర్. పి. పరాంజపే ఒక దీర్ఘోపన్యాసము చేసి, అధ్యక్షుని అభిప్రాయాలకు వ్యతిరేకంగా మాట్లాడాడు. అది సాంప్రదాయానికి చాలా విరుద్ధము. ఇంతకు పూర్వము మార్చి 2 న, లోకమాన్యతిలక్ లండన్ ప్రయాణ సందర్భంలో ఆయనకు శుభాకాంక్షలు తెలుపడానికి ఆప్టే అధ్యక్షతన ఒక సభ జరిగింది. తన రాజకీయాభిప్రాయాలన్నీ జస్టిస్ రానడే గారి శుశ్రూషత్వంవల్ల ఏర్పడినాయని, ఇప్పటికి

ఆ అభిప్రాయాలనే తాను కలిగి ఉన్నానని ఆప్టే ఆ సభలో చెప్పాడు. తిలక్ గారి ప్రయాణము సుఖప్రదముగా జరుగవలెనని, స్వయం పరిపాలన కొరకు ఆయన చేసే ప్రయత్నం సఫలం కావలెనని ఆయన భగవంతుణ్ణి ప్రార్థించాడు. "కర్మయోగ్"లో తాపస లక్షణాలు గల భవానంద్ పాత్ర, తిలక్‌ను, తిలక్ రాజకీయాలను ప్రకటిస్తున్నదనే విషయాన్ని మనం జ్ఞాపకముంచుకోవాలి.

పురపాలక సంఘ అధ్యక్ష పదవికి పోటీచేసి ఆప్టే ఓడిపోయినాడు. తిలక్ అనుయాయులు ఆప్టేను చూచి ఈర్ష్యపడసాగారు. మితవాదులకు కూడా ఆయన అదే విధముగా దూరమయినాడు.

శ్రీ జోషిపైన ఆయనకు కలిగిన దయవలన ఆయన కోసం తిస్తా - కుర్గ్రామ్ - చిల్‌మారీ రైల్వే షేర్లు అమ్మిపెట్టే పనికిగాను 1918 లో ఆప్టే కలకత్తాలో ఒక మాసము ఉన్నాడు. తరువాత పని మొత్తము జోషీ ఆప్టేకు ఒప్పగించాడు. మాట నిలబెట్టుకోవడానికి ఆప్టే పలు ప్రదేశాలకు పోవలసి వచ్చింది. అంతకు పూర్వమే ఆయన కండ్లకు జబ్బుచేసి, కంటిచూపు పూర్తిగా లేకుండా పోతుందా అని భయపడ్డాడు. ఆ భయము కొద్దిగా తగ్గేసరికి ఆయనకు మలేరియా జ్వరం తగిలింది. వీటికితోడు ఆయన అంతకు పూర్వం నుంచే దీర్ఘకాలికమైన అజీర్ణ వ్యాధితో బాధ పడుతున్నాడు.

ఆప్టే కలకత్తానుంచి ఢిల్లీకి, అచటనుండి ఇండోర్ మహారాజా హోల్కార్‌ను కలుసుకోవడానికి ఇండోర్‌కు వెళ్లాడు. మహారాజా వారు కొద్ది రోజులలో ఇండోరుకు తిరిగి వస్తారని తెలిసి, ఆప్టే అక్కడనే కొన్ని రోజులు ఆగిపోవలసి వచ్చింది. ఒక రోజున

ఉదయం వాహ్యాళికి వెళ్లి వస్తూ ఉండగా వడగండ్ల వానలో చిక్కుకొని పోయినాడు. దాని ఫలితంగా ఆయన కాళ్లకూ, పొట్టమీద వాపు కనపడింది. డాక్టరు సారంగపాణి, ఆయన నంజా వ్యాధివల్ల బాధపడుతున్నాడని చెప్పి ఆయనను త్వరగా యింటికి వెళ్లమని సలహా ఇచ్చాడు. ఆప్టే ఇండోర్ మహారాజా హోల్కార్‌ను కలుసుకొని, పని పూర్తి చేసుకొని అప్పుడు ఇండోర్‌నుంచి బయలుదేరాడు. త్రోవలో ఖండ్వాలో తిరిగి జబ్బుచేయడంవల్ల అక్కడ ఆగిపోవలసి వచ్చింది. నాగపూర్‌లో ఉన్న తన భార్యను కలుసుకోవలసిందని టెలిగ్రాము ఇచ్చాడు. కాని భుసావల్ స్టేషనులో ఆప్టేకు బదులు దీక్షిత్ గారి కుమారుడు కనబడగానే ఆమెకు భయం వేసింది. ఆప్టే జబ్బు సంగతి ఆయన ఆమెకు చెప్పగా వారిరువురు ఖండ్వా వచ్చారు. ఆప్టే భార్యతో కలిసి బొంబాయి వచ్చాడు. ''ప్రభుత్వ ఉన్నత ఉద్యోగాలలో భారతీయులకు స్థానమివ్వడం'' అనే విషయంపైన జనవరి 28 న ఆప్టే పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఎదుట బొంబాయిలో సాక్ష్యమీయవలసి ఉన్నది. ప్రయాణము చేయవద్దనే సలహాలను పాటించక ఆయన బొంబాయి వచ్చాడు. ఆనాటి సాయంత్రము బొంబాయిలో ప్రసిద్ధుడైన డాక్టరు భడ్‌కమ్‌కర్ ఆయనను పరీక్షచేసి, వెంటనే ఆయనకు పూర్తి విశ్రాంతిని కల్పించి, కదలవద్దని చెప్పాడు. పబ్లిక్ సర్వీస్ కమిషన్ ముందు హాజరు కావడానికి బదులు వారికి లిఖిత పూర్వమైన వివరణ పత్రాన్ని పంపవలసిందని కూడా చెప్పాడు. డాక్టరు దేశముఖ్ కూడా ఆప్టేకు పరిచర్య చేయసాగాడు. డాక్టర్లు ఆయనకు గుండెపోటు రావచ్చునని భయపడ్డారు. ఆయనకు వచ్చిన నంజా వ్యాధి నయమయ్యేటట్లుగా కనపడలేదు. వైద్య సహాయంవల్ల రెండు వారాలలో నీరు తగ్గి కొంత సుగుణము కన్పించింది. ఆయన జబ్బులో అయిదు వారాలు బొంబాయిలో

ఉన్నాడు. పూనానుంచి బంధువులందరూ ఆయనను చూడడానికి వచ్చారు. రైల్వే షేర్ల అమ్మకపు వ్యవహారానికి సంబంధించిన కాగితాలపై సంతకాల కోసమని వచ్చి జోషి కూడా ఆయనను ఆ సమయంలోనే ఇబ్బంది పెట్టాడు. నూతన గ్రంథాలు, ప్రచురణలు చదువుతూ ఆప్టే కాలము వెళ్లబుచ్చ కలుగుతున్నారు. ఈ విధంగా బాధను కొంతవరకూ ఆయన మరిచి పోగలిగాడు. ఇంత బాధలో కూడా ఆయన ప్రశాంతంగా ఉండి, స్నేహితులతో పరిహాసంగా మాట్లాడడానికి ప్రయత్నించేవాడు. డక్టరు స్నేహితులు ఆయనకు సలహా ఇవ్వడానికి, సహాయం చేయడానికి వస్తూ ఉండేవారు. అశుభప్రదమైన ఫిబ్రవరి 19 న (ఆ తేదీనే ఆయన కుమార్తె. గా॥ శ్రీ॥ జి. కె. గోక్లే చనిపోయినారు) ఆయన బాధ భరింపరానంత తీవ్రమైంది. ఉదరంలో బాగా నీరు కూడుకున్నది. డాక్టరు భాజేకర్ గారి వైద్యశాలలో ఆయనకు చికిత్స జరిగింది. ఆ నీటి కూడికను నిరోధించడానికి, ఉదరంలోని నీటిని బయటికి తీసివేయవలసి వచ్చింది. ఈ పని జరిగిన తరువాత కొంత సుగుణము కనిపించింది, కాని ఆయన పైత్య సంబంధమైన మత్తులో పడిపోయినాడు. ఆయన ఆరోగ్యం అంతకంతకు వేగంగా క్షీణించ నారంభించింది. డాక్టరు ఖడ్కమ్కర్ ఆయనను పూనా తీసుకొని వెళ్లమని సలహా ఇచ్చాడు. ఇట్టి నిస్సహాయ స్థితిలో శ్రీమతి ఆప్టే దుఃఖము వర్ణనాతీతము.

కష్టాలు ఒంటరిగా రావని అంటారు గదా! ఆయన జబ్బులో ఉండగానే ఆయన స్నేహితుడు ప్రొఫెసర్ లిమయే మరణవార్త ఆయనకు అందింది. చివరకు ఆయన అతికష్టంమీద పూనా వెళ్లడానికి అంగీకరించాడు. ఆయన వెంట ఒక డాక్టరు వెళ్లాడు. ఏదో పొరపాటువల్ల పూనాలో స్టేషనునుంచి ఆయనను ఇంటికి తీసుకొని

పోవడానికి నిర్ణయించుకొన్న కారు సమయానికి స్టేషనుకు రాలేదు. అందువల్ల ఆయన ఒక పల్లకిలో ప్రయాణం చేయవలసి వచ్చింది. వేసవికాలపు ఎండ, పల్లకిలో కుదుపులు ఆయన బాధను తీవ్రతరం చేసినాయి. ఇంటికి చేరేలోపున మూడుసార్లు రక్తం వాంతి చేసుకొన్నాడు. పూర్తిగా మగత వచ్చింది. నెత్తురు మరకలతో ఉన్న ఆయన దుస్తులు చూసి ఆయన భార్య మూర్ఛపోయింది. భార్యాభర్తలిరువురికీ డాక్టర్ చేసి వైద్యం చేశాడు. కొద్ది సేపట్లో ఆయనకు స్పృహ వచ్చింది. వెంటనే ఆయన తన మరణ శాసనాన్ని చెప్పి వ్రాయించి, తయారయిన ప్రతిమీద ఏదో విధంగా సంతకము చేశాడు. ఆయన ఒకసారి భార్య వైపు చూచి, తన కుటుంబానికి ఆ పరిస్థితులలో వీలైన తగిన ఏర్పాట్లు చేశానని ఆమెతో చెప్పాడు. ఆ రోజు చెల్లించవలసిన జీవిత భీమా వాయిదా సంగతికూడ మరిచిపోకుండా అందుకు తగిన ఏర్పాటు చేయుమని ఆమెకు చెప్పాడు (ఆయన మరణ శాసనము ప్రకారం తన గ్రంథములమీది సర్వహక్కులను సర్వెంట్సు ఆఫ్ ఇండియా సంఘానికి, దానికి అనుబంధ సంస్థ అయిన ఆర్య భూషణ్ ముద్రణాశాలకు ఆయన సంక్రమింపజేశాడు. వారు శ్రీమతి ఆప్టేకు ఆమె జీవిత కాలమువరకు నెలకు ఏబది రూపాయల వంతున వృత్తిని చెల్లించవలసి ఉంటుంది. ఆమె "ఆనందాశ్రమ్"లోనే నివసించవలసి ఉంటుంది.)

ఆయన చనిపోయే సమయం వరకు ప్రశాంతంగా ఉన్నాడు. ఆయన కేవలము తన మనోధైర్యం చేతనే మరొక మూడు గంటల కాలము, తన భార్యకొరకే అన్నట్లుగా, బ్రతుక కలిగాడు. 1919 మార్చి 7 వ తేదీ సాయంత్రము 7 గంటలవేళ ఈ ప్రపంచంలో జీవయాత్ర ముగించి, తన కుమార్తె కాంతకు

ఎచట కలుసుకోగలనని ఆయనకు నమ్మకమున్నదో ఆ అమర లోకాన్ని చేరాడు.

ఆ విధంగా ఒక ప్రఖ్యాత సాహిత్య జీవితము ముగిసింది.

పూనాలో అన్ని వర్గాలవారు, అన్ని రాజకీయ పక్షాలవారు ఆయన మరణానికి దుఃఖించారు. లోకమాన్య తిలక్ గారి "కేసరి" పత్రిక కూడా, ఆయన జీవిత విశేషాలతో కూడిన మరణ వార్తను ప్రచురిస్తూ, ఆయన వ్యక్తిగత గుణాలను, రాజకీయ, సాంఘిక, సాహిత్య కార్యకలాపాలను గొప్పగా శ్లాఘించింది.

ఆయిదో అధ్యాయము

# ఆప్టేగారి కృషి

ఆధునిక మరాఠీ సాహిత్యంలో శ్రీ ఆప్టే ప్రథమ ఉత్తమ నవలా రచయిత. ఆయన గ్రంథాలలో సాంఘిక నవలలు ముఖ్య స్థానాన్ని ఆక్రమిస్తాయి.

ఆయన ఏడు సంపూర్ణ సాంఘిక నవలలు రచించాడు. (1) మధలీ స్థితి, (2) పణ్ లక్షాత్ కోణ్ ఘేతో, (3) యశ్వంత్ రావ్ ఖరే, (4) మీ, (5) మయేచాబజార్, (6) భయన్కర్ దివ్య, (7) జగ్ హో అసే ఆహో. ఇవిగాక ఇంకా మూడు నవలలు అసంపూర్ణంగా ఉండిపోయినవి. అవి (8) గణ్పత్ రావ్, (9) ఆజాచ్, (10) కర్మయోగ్.

సాంఘిక నవలలో ఆయన, ఏబది సంవత్సరాల కాలంలో పూనాలో ఉన్న సంఘాన్ని ఎక్కువగా చిత్రించాడు. మధ్య తరగతి ప్రజల జీవితాల వాస్తవ చిత్రాలను ఆ నవలలో గోచరిస్తాయి. ఇంగ్లీషువారి ప్రభావం వారిమీద పడిన తరువాత వారిలో కలిగిన లోపాలను మన ముందు ఉంతొన్నాయి, సంఘ పురోభివృద్ధికి చికిత్సను సూచిస్తాయి. వినాశ హేతువులైన పురాతన సాంప్రదాయాలవల్ల కలిగే విపరీత ఫలితాలను మన ఎదుట కనపర్చడమేగాక, బ్రిటిష్ వారి ఆచార వ్యవహారాలను అనాలోచితంగా అంగీకరించి అనుకరిం

చడంవల్ల కలిగే దుష్ఫలితాలను కూడా ఆయన తన రచనలలో విమర్శించాడు.

విద్యావంతులైన స్త్రీ పురుషులు మన సంఘాన్ని పూర్తిగా సంస్కరించడానికి నడుం కట్టినప్పుడు, సంఘ సంస్కరణవల్ల కలిగే సత్ఫలితాలను కూడా ఆయన మన ఎదుట ప్రదర్శించాడు. నూతన సంఘముయొక్క ప్రకాశవంతమైన ఆదర్శ రూపాలను కూడా చిత్రించాడు. ఆప్టే నిశితమైన పరిశీలనా శక్తి కలవాడు. దానికితోడు మరాఠీ, ఆంగ్ల, సంస్కృత భాషలలో వివిధ విషయాలపై ఆయా గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథాలు చదివాడు. నూతన విశాల దృక్పథము అలవడడానికి అవి సహాయపడ్డయి. దానినే తన నవలలోనూ, చిన్న కథలలోనూ శక్తివంతముగా ప్రచారము చేయకలిగాడు. బ్రిటిష్ వారిని మనము గుడ్డిగా అనుకరించడంవల్ల, త్రాగుడు, నీతి రాహిత్యము అనే దుర్గుణాలు అన్నివైపులా వ్యాపించాయి. "మధలీ స్థితి" అనే ఆయన ప్రథమ నవలలో "మన సాంఘిక పతనము" అనేదే ప్రధాన చర్చాంశము. ప్రభుత్వము, విద్య వీనిని గురించి ప్రజలలో కలిగిన నూతన భావాలు కారణంగా కలిగిన సాంఘిక ప్రబోధము ఆయన "గణ్‌పత్ రావ్" అనే నవలలో ప్రధాన విషయము. సమిష్టి కుటుంబంవల్ల ఆయనకు కలిగిన కీళ్లు, కష్టాలను గురించిన అనుభవాలే "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" అనే నవలకు ఆధారము. సాంఘిక దురాచారాలవల్ల కలిగే నష్టాలను—అందులోనూ ప్రత్యేకంగా స్త్రీల దుస్థితి, వారి పరాశ్రయత, విద్యావిహీనత, స్త్రీ పురుషుల వ్యక్తిగత స్వాతంత్ర్యముమీద మతాచార ప్రాబల్యము, వీటివల్ల కలిగే నష్టాలను సంఘము ఎదుట ప్రదర్శించడంలో సంఘ సంస్కర్తలు

చేస్తున్న ప్రయత్నాలను చివర నవల ప్రధానంగా వివరిస్తుంది. "యశ్వంత్ రావ్ ఖరే" "అజాచ్" నవలలు రాజకీయ, సాంఘిక సంస్కరణవాదులు ఎదుర్కొన్న పోరాటాలను స్థూలంగా చర్చించాయి. "మీ" కూడా దేశపురోభివృద్ధికి జరిగే ప్రయత్నాలను చిత్రిస్తూ, రాజకీయాలలో మన ఆదర్శాలను వర్ణిస్తుంది. స్త్రీ విద్య. స్త్రీల ఆశయాలు, ఆ ఆశయాలు ఫలించక పోవడంతో వారిలో కలిగే నిరాశా నిస్పృహలు, మారుతూ ఉన్న పరిస్థితులకు అనుకూలించని సాంఘిక స్థితిగతులు ఇవే "భయన్కర్ దివ్య" "మయేచా బజార్" అనే నవలలో విషయాలు. ఆప్టే ఈ మూడు నవలలలో సాధారణ కథన విధానము, స్వీయ కథన విధానము - రెండూ ఉపయోగించాడు. అంతకు పూర్వము ఆయన వ్రాసిన నవలలలో అలౌకిక శక్తులూ, హఠాత్ సంఘటనలూ ఉపయోగించబడ్డాయి. ఈ మూడు నవలలు దానికి భిన్నమైన మార్గంలో వాస్తవికతకు స్థానం ఇచ్చాయి. కాని ఆయన నవలలో ఉండే వాస్తవికత, అధునాతన వాస్తవిక సాహిత్యంలో కనిపిస్తున్న భ్రంశాలు, వికారాలు, అశ్లీలాలు, అసహ్యాలతో కూడిన వాస్తవికత వంటిది కాదు. అప్పుడప్పుడు ఒక నవలలో పాత్రలు మరొక నవలలో ప్రవేశిస్తాయి. ఉదాహరణకు "మథలీస్థితి" విష్ణు, యమున "గణ్‌పత్ రావ్", పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" లలోనూ కనిపిస్తారు. గణ్‌పత్ రావ్ అనే పాత్ర "గణ్‌పత్ రావ్" అనే నవలలో ప్రధాన పాత్ర. కాని ఆ పాత్ర "అజాచ్", "కర్మయోగ్", "భయన్కర్ దివ్య" అనే నవలలలో కూడా కనిపిస్తుంది. నానా, అతని భార్య యశోద "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో", "కర్మయోగ్" లలో ఉన్నారు. స్వామి అద్వైతానంద, లీలీ వీరు "అజాచ్", "కర్మయోగ్"లలో

ఉన్నారు. తాయి పాత్ర "భయన్‌కర్ దివ్య", "కర్మయోగ్"లలో ఉన్నది. ఈ విధంగా ఒకే పాత్రలను వేర్వేరు నవలలో ప్రవేశపెట్టి వాటికి పరస్పర సంబంధాలను కల్పించడంలో ఆయన కొన్ని ఇంగ్లీష్. ఫ్రెంచి నవలలలోని విధానాన్ని బహుశః అనుకరించి ఉంటాడు.

"పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" అనే నవల స్పష్టంగా, హిందూ మతాచార ప్రకారం విగత భర్తృకలకు కేశఖండనంవల్ల కలుగుతూ ఉన్న దుర్దశను, అవమానాన్ని వర్ణిస్తుంది. గర్హ్యమైన ఈ దురాచారాన్ని ఆయన నిశితంగా వ్యక్తిగతంగా పరిశీలించి ఉంటాడనడంలో అనుమానములేదు. అందువల్లనే తన హృదయంలో ఉన్న బాధనంతా ఆయన ఆ నవలలో వెళ్లబోశాడు. శంకర్ మామన్‌జీ (మామగారైన శంకర్) చాలా బాగా చిత్రించబడ్డాడు. తరువాత తరువాత ఈ పేరు కఠినుడూ, క్రూరుడూ, మోసగాడూ అయిన వ్యక్తికి పర్యాయపదమైంది. మహారాష్ట్రంలో ఉత్సాహోద్రేకాలను, ప్రబోధాన్ని కలిగించడంలో ఈ నవల, మిస్ హారియట్ స్టోల్ వ్రాసిన "అంకుల్ టామ్స్ కాబిన్"తో పోల్చతగి ఉంటుంది. అవిభక్త కుటుంబంలోని నష్టాలు కూడా ఈ నవలలో వర్ణించబడ్డాయి. అంతకు పూర్వము ఇంగ్లీషు అధికారులు, క్రైస్తవ మత ప్రచారకులు వీనిని భయంకరంగా వర్ణించి, హిందూ సంఘాన్ని అన్నివిధాలా విమర్శించడానికి పూనుకొన్నారు. ఈ పాక్షికమైన విమర్శలో అవిభక్తకుటుంబమువల్ల కలిగే లాభాలు పూర్తిగా విస్మరించబడ్డాయి. దేశీయులైన మేధావులు మన సాంఘిక, ఆర్థిక నిర్మాణాన్ని పరిశీలించినపుడు మాత్రమే దానివల్ల లాభాలు కొంతవరకు అర్థమయాయి. కాని ఈ నవల మాత్రము దానివల్ల కలిగే నష్టాలను మాత్రమే వర్ణించింది.

"యశ్వంత్ రావ్ ఖరే" ఆ రోజులలో ప్రచారంలో ఉన్న రాజకీయ భావాలను పూర్తిగా చర్చించింది. సత్వర స్వాతంత్ర్య సంపాదనలో సాంఘిక సంస్కరణలు, రాజకీయ సంస్కరణలు, వీనిలో దేనికి ఎక్కువ ప్రాధాన్యమిస్తే ప్రయోజనకరము - అనే సమస్యపై ఉన్న అభిప్రాయ భేదాలు ఈ నవలలో వివరంగా ప్రదర్శించబడ్డాయి. ఆంగ్లేయ పరిపాలకుల ప్రభావానికిలోబడి, తమ ప్రథమోత్సాహంలో సంఘ సంస్కరణ వాదులు, సంఘ సంస్కరణకు మాత్రమే ప్రాధాన్యమిచ్చి, రాజకీయ సంస్కరణవాదుల ప్రయత్నాలను చులకనగా చూశారు. కాని సాంఘిక సంస్కరణవాదుల అభిప్రాయాల కంటె రాజకీయ సంస్కరణ వాదుల అభిప్రాయాలే వివేకవంతమైనవీ, అతి ముఖ్యమైనవీ అని కాలము రుజువు చేసింది. ప్రథమంలో సంఘ సంస్కరణలకే ప్రాధాన్య మిచ్చిన జస్టిస్ తెలంగ్ వంటి ప్రముఖ మితవాదులు కూడ ఈ విషయాన్ని త్వరలో గుర్తించారు. ఈ నవలలో చిత్రించబడిన రాజకీయాలు చాల స్థూలంగా మాత్రమే వర్ణించబడినట్లు కనపడుతుంది. వాస్తవానికి ఏ రాజకీయవేత్త కూడా ఎప్పుడూ సంఘ సంస్కరణలను అవహేళన చేయలేదు. రాజకీయ వేత్తలు స్త్రీలను అగౌరవ పరచలేదు సరికదా, వారి సమస్యల విషయంలో అశ్రద్ధనుగాని, నిరాదరణ కాని ఎప్పుడూ చూపలేదు. సుప్రసిద్ధ దేశభక్తుడు, దేశసేవకుడు అయిన విష్ణుశాస్త్రి ఛిప్లూణ్కర్‌ను ఈ నవలలో "యశ్వంత్ రావ్" పాత్ర ద్వారా ఆప్టే పరిహాసం చేశాడు. ఆప్టేవంటి ప్రసిద్ధ మరాఠీ గ్రంథకర్త అట్టి వ్యక్తిని తన గ్రంథంలో తేలిక పరిచి చిత్రించడం చాలా విచారకరమైన విషయము. సంఘ సంస్కరణల ప్రాధాన్యం విషయంలో ఆయన కున్న ప్రథమావేశమే అందుకు కారణము.

‘మీ’ దానికంటె ఉత్తమ రచన. దేశభక్తి నిమిత్తంగా చాల వస్తువులను త్యాగం చేయవలసిన అవసరాన్ని గురించి అది తెలుపుతుంది. “భా” (ఆయనే నవలలో తరువాత భవానంద్ అవుతాడు) పాత్రలో ఆధ్యాత్మికత్వము, ఆత్మత్యాగము రెండూ మిళితమయి ఉన్నాయి. ఆయన “సుందర” యందు తనకుగల గాఢ మైన ప్రేమను కూడా త్యాగం చేసినట్లు చిత్రించబడ్డాడు. గ్రంథస్థ విషయము యొక్క సర్వకాలీకత్వమువల్ల ఆ నవల ఎల్లప్పుడు నూతనంగానే ఉంటుంది. సన్యాసిగా ఉండి దేశసేవ చేయడంలోనే “భా” తన జీవితమంతా గడిపి వేశాడు.

“జగ్ హో అసే ఆహో” కేవలం వినోదాన్ని సమకూరుస్తుంది. ఒక సవతి కుమారుడు అతని భార్య కలిసి, సవతి తల్లిని ఆమె బిడ్డలను హింసించిన గాథ అందులో వర్ణించబడినది. ఆ సవతి తల్లిబిడ్డలు చివరకు తగు మాత్రము ఐశ్వర్యంతో సుఖజీవనం గడిపినట్లుగా అందులో చిత్రించబడినది. అనగా జీవితంలో మంచి, చెడును ఓడించి, తుదకు జయమును పొందగలదనే సాంప్రదాయక భావము అందు మనకు వెల్లడవుతుంది. స్నేహ సానుభూతులుగల మిస్టర్ ఫెయిర్ బ్రెయిన్ ఆంగ్లేయుడు, క్రూరుడైన ఆంగ్ల ఉద్యోగి మిస్టర్ బుల్లీ స్నీక్, మానవ సేవా పరాయణురాలైన క్రైస్తవమత ప్రచారిణి సిస్టర్ ఛారిటీ—ఈ ముగ్గురు ఈ నవలలో పక్కీపాత్రలు. ఆ పాత్రల ద్వారా ఆ రోజులలో ఆంగ్లేయులు చేస్తూ వచ్చిన మంచి పనులు చిత్రించబడ్డాయి.

“భయన్‌కర్ దివ్య”లో మంచి నడవడి కలిగి చదువుకొన్న పాత్ర కమల. ఆమె తండ్రి బల్‌వంత్‌రావ్ తిరిగి వివాహం చేసు

కొన్నాడు. పూర్వాచార పరాయణుడైన తండ్రి అభిప్రాయాలకు వ్యతిరేకంగా కమల పద్మాకర్‌ను వివాహమాడి పడిన కష్టాలు ''భయంకర్ దివ్య''లో వర్ణించబడ్డాయి. దుష్టుడైన రాజారామ్ మూలంగా తప్పు త్రోవనపడి పద్మాకర్ కొంతకాలము కమలను వదిలి వేస్తాడు. రాజారామ్ దుర్మార్గము బయటపడిన తరువాత ఆ దంపతు లిరువురు మధ్యలో వచ్చిన వైరాన్ని మరిచిపోయి తిరిగి కలుసు కొంటారు. చదువుకొన్న స్త్రీ, జీవితంలో సుఖపడగలదనే భావన ఆనాటి సమాజ జీవితానికి అనుకూలించేది కాదని బహుశః ఆప్టే ఆ నవలలో చెప్పదలచుకొన్నాడు. దంపతుల పరస్పర ప్రేమ, విశ్వాసాలు మాత్రమే వారి సంతోషకరమైన జీవితానికి సహాయపడతాయి

''మయేచా బజార్'' యొక్క ఉద్దేశ్యము అంత వివరంగా తెలియడం లేదు. విద్యావంతురాలై విశ్వాస పాత్రురాలైన పద్మ ఆమె జీవిత పర్యంతము దురాశాపరుడైన భర్త చేత హింసించబడడం. ఆమెను ప్రేమించిన వసంత్‌రావ్ తన ప్రేమయొక్క గాఢత్వంవల్ల జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండి కృశించి పోవడం - ఇది ఆ నవలలో కథ.

''అజాచ్'' ఒక అసంపూర్తి నవల. అదివరకు వ్రాయబడిన నవలలోని చాలా పాత పాత్రలతోబాటు కొన్ని కొత్త పాత్రలు కూడా ఇందులో ఉన్నాయి. బహుశః ఇందులో మనజాతి పునర్నిర్మాణానికి ఆప్టే నూతన నిర్మాణాత్మకమైన సూచనలు ఇవ్వదలచు కొన్నాడు. ఆకారణం చేతనే, రాజకీయాభివృద్ధిని కోరే యశ్వంత్ రావ్ ఖరే, రాజకీయ సంస్కరణలకన్నా సాంఘిక సంస్కరణలకు

ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చే గణపత్‌రావ్, దేశ పారిశ్రామికాభివృద్ధిని వాంఛించే కృష్ణబాపు, దేశంకోసం నిస్స్వార్థంగా తమ సర్వస్వాన్ని అర్పించగల సన్యాసులను తయారు చేయగల సంస్థలను తిరిగి నెలకొల్పవలెనని కోరే అద్వైతానంద, వీరు ఇందులో మనకు కనపడతారు. భవానంద్ సర్వతోముఖాభివృద్ధి కోరాడు. కాని ఆయన పై నలుగురు వ్యక్తుల ప్రతిఘటనను ఎదుర్కొన్నాడు. కాని ఆయన ఈ ఇబ్బందుల నన్నింటినీ అధిగమిస్తూ తన పనిని తాను సాగించాడు. ఈ నవలలో ఆప్టే బహుశః భవానంద్ ఆశయాల విజయాలను నిరూపించవలెనని అనుకొన్నాడు.

"కర్మయోగ్" కూడా అసంపూర్ణమే. అది ఆప్టే ధారావాహిక నవలలో చిట్టచివరిది కూడాను. గణపత్‌రామ్ కుమారుడు చంద్రశేఖర్. చంద్రశేఖర్‌కు సన్నిహిత బంధువు లిలీ - వీరిని ఆధారం చేసుకొని ఈ కథ కల్పించబడ్డది. పాశ్చాత్య విద్యా ప్రభావంవల్ల దేశభక్తుడు, నాస్తికుడు అయిన చంద్రశేఖర్‌కు ఆధ్యాత్మిక తత్త్వవేత్త అయిన స్వామి అద్వైతానంద్‌తో పరిచయం కలుగుతుంది. తాను చేసే పనులు జయప్రదం కావడానికి, వాటికి బలం చేకూరడానికి మత విశ్వాసం కూడ అవసరము అని చంద్రశేఖర్ తెలుసుకొనేటట్లు చేయడమే బహుశః ఆప్టే అభిప్రాయమయి ఉండవచ్చు. భవానంద్ యొక్క ఆశయాలకు తనను అంకితము చేసుకొన్నట్లు కనపడుతుంది. దీనికి పోటీగా అతని సన్నిహిత బంధువు లిలీ సమాజాభ్యుదయానికి తన జీవితాన్ని అంకితం చేయవలెననే నిశ్చయానికి రావడం జరుగుతుంది. ఆమె తన వైవాహిక జీవితాన్ని, ప్రాపంచక సుఖాలను త్యాగం చేస్తుంది; మత విశ్వాసంతో కూడిన ఆత్మత్యాగము, ఆ నవలలో సర్వవ్యాప్తంగా కనబడుతుంది.

పాత్ర చిత్రణలో ఆప్టే కళను, సౌందర్యాన్ని మేళవించాడు. సౌందర్యాన్ని మేళవించక పోయినట్లయితే ఆయన కళ దెబ్బతినేది. ఆయన పాత్రలన్నీ చాలా మటుకు వాస్తవిక జీవితాన్నుంచి తీసుకోబడ్డాయి. ఆ పాత్రల గుణశీలాలు జాగ్రత్తగా ఏరి తీసుకోబడ్డాయి. ఇందువల్ల వాస్తవికత, ఆకర్షణ సంప్రాప్తమయినవి. కొన్ని నవలలలో ఆయన కనపరచిన గూఢతకు కారణం ఆయన డికెన్స్, జేన్ ఆస్టిన్ వంటి ఆంగ్ల నవలా రచయితలను అనుకరించడమే. ఏవో ఫలితాలకొరకు ప్రతీక్షించేటట్లు చేసి, యువతరము పాఠకులను ఆకర్షించడానికి అది బాగా సహాయపడింది. "మయేచా బజార్"లో ఒకముఠా దుర్జనత్వం, "భయన్కర్ దివ్య"లో రాజారామ్ గూఢత పాఠకులను ఆకర్షించి, వారు ఆ నవలలు చదవడానికి కారణమవుతున్నాయి. "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో", "మీ", "యశ్వంత రావ్ ఖరే"లలో భవిష్యత్సూచకాలైన స్వప్నాలను ఆప్టే ఉపయోగించాడు. (బహుశః ఆయనకు అటువంటి కలలలో నమ్మకమున్నది.) ఆ నవలలోని గూఢతవల్ల ఏర్పడిన సంశ్లిష్ట పరిస్థితులు పాఠకులలో ఔత్సుక్యాన్ని కలిగిస్తాయి. అచ్చటచ్చట గూఢతలున్నప్పటికీ, ఈ నవలలోని కల్పనా చాతుర్యము బాగుంటుంది. ఆ నవలల ప్రధాన ఆకర్షణ వాని వాస్తవికతే. ఈ వాస్తవికత సాధించడానికి స్వీయకథనా విధానము బాగా ఉపయోగపడింది. పలువురు పాఠకులు ఈ వాస్తవికతవల్ల ముగ్ధులైనారు. "పణ్ లక్షాత్ కోణ్ ఘేతో" యమునయొక్క స్వీయ చరిత్ర కావడంచేత, దానిని చదివిన స్త్రీ పాఠకులు దానిని ఆప్టే వ్రాశాడంటే ఏ మాత్రం నమ్మలేక పోయినారు. ఆయన తన నవలలో ప్రదర్శించిన పాత్రల వైవిధ్యము, అత్యాశ్చర్యకరంగా ఉండి, తన చుట్టూ ఉన్న సంఘాన్ని రచయిత ఎంత నిశితంగా పరిశీలించాడో తెలియపరుస్తుంది.

ఆప్టే తన నవలలను వారు, మాసపత్రికలలో ధారావాహికంగా ప్రచురించిన ఫలితంగా, దీర్ఘవ్యాప్తివల్ల అవి విసుగును పుట్టించాయి. ప్రతి కొన్ని అధ్యాయాల చివర ఒక నూతన సంధిగ్ధస్థితి ఏర్పడడం, ఆయన ఉత్తమ కథనాన్ని కొంత చెడగొట్టిందనె చెప్పాలి. స్కాట్ డికెన్స్ విషయంలో ఆ పరిస్థితులలో ఏమి జరిగిందో, ఆప్టే విషయంలోకూడా అదే జరిగిందని అనుకోవచ్చు. రచనకు, ప్రచురణకు మధ్యగల వ్యవధివల్ల కొన్ని పొరపాట్లు - అవి రాజా తప్పక అనే అంగీకరించాలి - దొర్లాయి. ఆ దీర్ఘ వ్యాప్తిత్వం వల్లనే ఆయన అభిమానుల సంఖ్య ఈనాడు చాలా తగ్గింది. ఒకేసారి రెండు, మూడు నవలలను ధారావాహికంగా ప్రచురిస్తూ ఉండడం, మరికొన్ని ఇతర వ్యాసాలను కూడా ప్రకటిస్తూ ఉండడంవల్ల ఆ మొదటి నవలమీద ఆయనకున్న పట్టు తప్పి, కథలో అభిరుచికాని, ఔత్సుక్యము కాని చివరకు నిలబడలేదు. అటువంటి నవలలు అసంపూర్తిగానే ఉండి పోవలసివచ్చింది. నవలలోని కథానిర్మాణాలు ఒకదానిని ఒకటి పోలి ఉండడం, సంభాషణలు ఒకే మాదిరిగా ఒకే విషయంపై ఉండడం తటస్థించింది. అసంఖ్యాలైన ఆ పాత్రల వ్యవహారం చివర అధ్యాయంలో ఏదో విధంగా ముగింపు చేయవలసి వచ్చేది. ఈకాలపు పాఠకులకు ఇది యావత్తూ అశ్రద్ధగా చేసిన పనివలె కనిపిస్తుంది.

ఆయన సాంఘిక నవలలో ముఖ్యంగా ఎన్నతగిన పాత్రలు—యశ్వంత్ రావ్, గణపత్ రావ్, భవానంద్, చంద్రశేఖర్ వారు ఘనత పాండిత్యము. దేశభక్తి మూర్తీభవించిన వ్యక్తులు, క్రూరమైన పాత్రలు—గోవింద్ రావ్, శంకర్ మామన్ జీ, రాజారామ్, చింతో

పంత్, ఒక్క మంచి గుణముకూడ లేనివారి దుర్మార్గమువల్ల వారు పాఠకుల మనస్సులలో నిలిచిపోతారు. స్త్రీ పాత్రలలో లక్ష్మీబాయి, యమున, తాయ్, సుందరి, పద్మ, కమల, ద్వారకాబాయి, లిల్లీ పాత్రలను ఎల్లప్పుడూ ఆకరిస్తారు. లక్ష్మీబాయి, యశోదాబాయి, యమున వివాహిత స్త్రీలను గురించి ఆప్టేకు ఉన్న ఆదర్శాలను ప్రదర్శిస్తారు. సుమారు ఆరవయి సంవత్సరాలకు పూర్వపు కాలానికి చెందిన పరిసరాలలో పూర్వ హిందూ కుటుంబ జీవితపు ఉత్తమ గుణాలను, వానికి తగినవారి విధులను ఆ పాత్రలు మనకు తెలుపుతాయి. ప్రసన్నత. భక్తిశ్రద్ధలు, సుశీలత కలిగి ఉండడమే కాదు, వారు ఆ పాత్రలు నమ్రతకు ఆదర్శమూర్తులుకూడ. తాయ్, సుందరి, లిల్లీ వీరు ఆప్టే కలలుకనే ప్రపంచంలో పైకి వస్తున్న స్త్రీలు. ఆ పాత్రలు ఈ రోజులలో వాస్తవికంగా కనపడుతాయి. ఆ పాత్రల [illegible] లోను. సంస్కృతిలోను ఆదర్శకపూర్వమైన స్వాతంత్ర్య ప్రవాహము జాలువారుతూ ఉంటుంది.

తన వ్యక్తిగత అనుభవానికి అందుబాటులో లేని ఏ పాత్రను తాను చిత్రించలేదని ఒకసారి ఆప్టే అన్నాడు. ఇది చాలా ప్రధానమైన మాట, చాలావాస్తవమైనది. వినాయక్‌రావ్, గోవింద్‌రావ్, డాక్టరు ముంగ్‌కే, గోపాల్‌రావ్, అనంత్‌రావ్ — ఈ పాత్రలు నిజంగా వాస్తవికమైన పురుషులయొక్క చిత్రాలు, పూనాలోని "విజయానంద్ నాటక్‌గృహ్" "మథలీస్థితిలో" "హర్ష్ నిధాన్" నాటకశాలగాను, "పూనా వైభవ్" "శంఖధ్వని"గాను వర్ణించబడ్డాయి, యమునకూడ ఒక వాస్తవికమైన వ్యక్తి. ఆమె బాధలన్నీ వాస్తవికమైన అనుభవం ఆధారంగా చిత్రించబడ్డాయి. గణపత్

రావ్ కొంతవరకూ గ్రంథకర్త. విష్ణుశాస్త్రి చిప్లూణ్కర్, యశ్వంత్ రావ్ గురువు. శ్రీధర్ పంత్ గా కొంతవరకూ చిత్రించబడ్డాడు. కృషన్‌రావు పాత్ర శ్రీనామ్‌జోషే ఆధారంగా చిత్రించబడింది. డక్కన్ కాలేజి ప్రిన్సిపలు బెన్ ''కర్మయోగ్''లో అమరజీవి అయాడు. వాస్తవమైన ఇంగ్లీషు వ్యక్తులు మిస్టర్ ఫెయిర్ బ్రెయిన్, మిస్టర్ బుల్లీస్మిత్‌గా రూపొందారు. సిస్టర్ భారతీకూడా వాస్తవమైన వ్యక్తే.

ఆప్టే వ్రాసిన నవలలు వాస్తవాన్ని చిత్రించాయి. అవి ఆయన చుట్టూ ఉన్న సంఘాన్ని దాని అన్ని గుణాలతోను—సద్గుణాలు, దుర్గుణాలు—చిత్రించాయి. ఆయన సృష్టించిన పాత్రలు కొన్ని ఆదర్శపాత్రలు అనగా ఆయనకున్న ఆదర్శాలను ప్రతి ఫలింపజేసేవి. ప్రేమ. విధినిర్వహణ, పెద్ద మనిషి తరహా. అందము, తెలివి – ఇవి ఆయన ఆదర్శాలు. అవి సాధించతగిన ఆదర్శాలేకాని అసాధ్యాలు కావు. అవి సునిశితమైన బుద్ధి కలవారందరికి ఆమోదయోగ్యమైనవి. మహారాష్ట్రంలోని సాంఘిక పరిణామంలోను, సాంఘిక నైతిక ప్రమాణాలను ఉచ్ఛస్థితికి తీసుని రావడంలోను ఆయన ప్రదర్శించిన ఆదర్శాలు తమ పనిని తాము నిర్వహించాయి. స్త్రీల ఎడల చూపవలసిన ప్రవర్తన విషయంలో ప్రజలకు మిక్కిలి సున్నితమగు బుద్ధిని కల్పించడంలో ఆయన ప్రత్యేకంగా జయము పొందాడు. ఆ రోజులలో స్త్రీల ఎడ పురుషులు ప్రవర్తించే ప్రవర్తనలో ఉండే పూర్వాచార పరాయణత్వము, సంకుచిత బుద్ధి, అజ్ఞానము, అనుమానము, నిర్దయ ఇప్పుడెవరూ ఊహించనుకూడా లేరు.

తగిన సంభాషణలు, అందమైన వర్ణనలలోనే ఉన్నది ఆయన సాంఘిక నవలలో ఉండే ఆకర్షణ యావత్తూ. చిన్న వయస్సులో ఉన్న చాల బాలికలను, వయస్సువచ్చి వివాహితులైన బాలికలను, ఆదర్శాలుగల నాయికా నాయకులను, భార్యాభర్తలను ఆయన చిత్రించినవిధము చాలా వాస్తవికంగాను, ఆకర్షణీయంగాను ఉన్నది. ఆయన సృష్టించిన కరుణరసం హృదయవిదారకంగా ఉంది. నదులు, పర్వతాలు, అరణ్యాలు, వృక్షాలు, ప్రాతఃకాలసాయం సమయాలు, సూర్యోదయ సూర్యాస్తమయాలు మొదలైన ప్రకృతి దృశ్య వర్ణన మిక్కిలి స్వభావ సిద్ధంగా ఉండి, వర్డ్స్‌వర్త్ కవి పోకడను తెలుపుతుంది. "కర్మయోగ్"లో వనేశ్వరి వర్ణన, "అజాచ్"లో హిమాలయాల వర్ణనలు పాఠకులను అమితంగా ఆకర్షిస్తాయి. సమకాలిక మహారాష్ట్ర సంఘంలో ఉన్న ఆచార వ్యవహారాలు, అలవాట్లు, మతవిశ్వాసాలు, గుడ్డి నమ్మకాలు - వీటి అపూర్వ జ్ఞానం ఆయన నవలలో మనకు కానవస్తుంది. సంఘ సంస్కరణకు గాను ఆయన చేసిన సూచనలు సూటి అయినవీ, వాస్తవికమైన వీను. ఆయన కెప్పుడూ పాక్షిక అభిప్రాయాలు లేవు, రాజకీయాలలోను. పారిశ్రామిక విషయాలలోనుకూడా సంస్కరణావసరాన్ని గురించి నొక్కి చెప్పాడు. సంఘ సంస్కరణలను ప్రచారం చేయడంలో, లోకహితవారి. ఫూలే, ఆగర్‌కర్‌లవలె తీవ్రమూ, పరుషమూ అయిన భాష ఉపయోగించడానికిగాని, సంఘ పెద్దల సదభిప్రాయాన్ని పోగొట్టుకోవడానికిగాని ఆయన పాల్పడలేదు. ఆయన అభిలషించిన సంస్కరణలన్ని ఆయన కాలంలోను తరువాతను అమలులోకి వచ్చాయి. వానినిబట్టే ఆయన రచనలు ఎంతగా సఫలీ

కృతమయినవో మనము అంచనా వేయవచ్చు. 1885 తరువాత వచ్చిన మరాఠీ నవలకు ఆయన పురోగామి కావడం వల్ల ఆయనను "నవీన మరాఠీ నవలాపిత" అని అనడంలో అసహజమేమీ లేదు. 1913లో వి. యస్. జోషీ తన నవల "రాగిణి"ని ప్రచురించి రంగం మీదికి వచ్చేవరకూ ఆప్టే నవలలే మహారాష్ట్రంలో విరివిగా ప్రచారంలో ఉన్నాయి. ఇప్పటికీ ఆయన నవలలకు ప్రజాదరణ తగ్గలేదు, కాని రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలములలో బయలు దేరిన నూతన సాహిత్యం, అంతకు పూర్వమున్న మరాఠీ సాహిత్య ప్రక్రియలను వెనుకకు నెట్టి, వాని ప్రాధాన్యాన్ని కొంతవరకు తగ్గించింది.

## ఆరో అధ్యాయము

# చారిత్రిక నవలలు

ఆకర్షణీయమైన చారిత్రిక నవలలను ఆప్టే వ్రాయక పూర్వము మహారాష్ట్రంలో చారిత్రిక నవలలు బహు తక్కువగా ఉన్నాయి. తన నవలలకు చరిత్రను, ఇతిహాసాలను అతను ఆధారాలుగా ఉపయోగించుకొన్నాడు. చారిత్రిక విషయాలను, పాత్రలను కథా విషయాలుగా ఉపయోగించుకోవడంలో ఒక ప్రమాదమున్నది. చరిత్ర ఇదివరకే, చారిత్రిక విషయాల నిజానిజాలను చర్చించి నిష్పాక్షికంగా నిర్ధారణ చేసింది. కనుక ఆ పాత్రలను రూపొందించడంలో గాని, వాటిని తన ఇష్టానికి అనుగుణంగా పోషించడానికి గాని నవలా రచయితకు స్వాతంత్ర్యము చాలా తక్కువ. అందువల్లనే చారిత్రిక నవలా రచయితలందరూ చారిత్రిక వాతావరణాన్ని తీసుకొంటారు, కాని ఆ వాతావరణంలో ప్రసిద్ధ చారిత్రిక వ్యక్తులను ప్రవేశ పెట్టడం మాత్రం చాలా అరుదుగా జరుగుతూ ఉంటుంది. స్వీకరించిన ఆయా పరిస్థితులకు తగినట్లుగా వారు తమ స్వంత పాత్రలను సృష్టించుకొంటారు, భావనా కల్పితమైన వివరణ ద్వారా చరిత్రాంశాలకు ఒక సంపూర్ణత కలిగించడమే చారిత్రిక నవలల పని అని మామూలుగా భావించబడుతున్నది. చారిత్రిక నవల అనగా చారిత్రిక కల్పన అనే మాట నిజంగా అర్థంలేనిది. ఎందువల్లనంటే, కల్పన అయితే చరిత్ర కావడానికి వీలులేదు. చరిత్ర అయితే కల్పనకు అవకాశంలేదు.

అందువల్ల, చారిత్రిక వాతావరణాన్ని ఉపయోగించుకోడం, కల్పనకు అవకాశమిస్తూ ఆయా పరిస్థితులకు అనుకూలమయ్యే కల్పిత పాత్రలను సృష్టించి, చిత్రించడం ద్వారా ఆ సందిగ్ధ పరిస్థితి పరిష్కార మవుతున్నది. ఈ రంగంలో ఆప్టే గొప్ప ఫలితాలను సాధించాడు. మధ్య యుగ భారతదేశ చరిత్రాంతర్గమయిన రాజపుత్, మరాఠీ చరిత్రలనుండి కొన్ని భాగాలను తన నవలలకు విషయాలుగా తీసుకొన్నాడు.

చారిత్రిక పత్రిక నొకదానిని ప్రచురించడం ద్వారాను, చారిత్రిక విషయాలపై వ్యాసాలు వ్రాయడం ద్వారాను ఛిప్లూణకర్ చారిత్రక పరిశోధనకు ప్రోత్సాహం కలిగించి నప్పటినుంచీ చారిత్రిక మూలాధారాలను ప్రకటించడంతో మిక్కిలి ఉత్సాహం కనపడ సాగింది. 1885 లో రాయ్‌గఢ్‌లోని శివాజీ మహాశయుని "సమాధిని" పునర్నిర్మాణము చేయడానికి ఏర్పాట్లు జరిగాయి. లోగడ గ్రాంట్ డఫ్ తన "మహారాష్ట్ర చరిత్ర" లో మరాఠా చరిత్రను అవకతవకగా వ్రాశాడు. ఇప్పుడు జస్టిస్ రానడే "మహారాష్ట్ర శక్తి విజృంభణము" అనే గ్రంథం వ్రాసి మహారాష్ట్ర చరిత్రను వాస్తవిక దృక్పథములో రచించాడు. శివాజీ ఉత్సవాలను తిలక్ ఆరంభించాడు ఇటువంటి వాతావరణము చారిత్రిక నవలలు వ్రాయడానికి ఆప్టేను పురికొల్పింది.

ఆప్టే వ్రాసిన చారిత్రిక నవలలు పదకొండు—(1) మహిసురాచావాఘ (1891); (2) ఉషఃకాల్ (1897); (3) కేవల్ స్వారాజ్యాసాఠీ (1899); (4) రూప్‌నగర్ చీరాజ్‌కన్యా (1902);

(5) చంద్రగుప్త్ (1904); (6) గడ్ ఆలా పణ్ సింహ్ గేలా (1903); (7) సూర్యోదయ్ (1908); (8) మధ్యాహ్న (1906); (9) సూర్యగ్రహణ్ (1909); (10) కాల్‌కూట్ (1911); (11) వజ్రఘాత (1915). 8, 9, 10 గ్రంథాలు అసంపూర్ణమైనవి. ఇవన్నీ పూర్వ, మధ్య యుగాల చరిత్ర, శివాజీ, పేష్వాల చరిత్రలకు సంబంధించినవి. తాను ఏకాలానికి సంబంధించి వ్రాయదలచుకొన్నాడో ఆకాలానికి సంబంధించి ఇంగ్లీషులోగాని, మరాఠీలోగాని దొరికిన సమాచారాన్నంతా ఆయన చదివేవాడు. "చంద్రగుప్త"కు సంబంధించినంత వరకు పద్మపురాణాన్ని, "ముద్రారాక్షస" అనే సంస్కృతనాటకాన్ని చదివాడు. మధ్యయుగ చరిత్రకొరకు, శివాజీ, పేష్వాల చరిత్రలకొరకు ఇంగ్లీషులోకి అనువదించబడిన పర్షియా దేశపు మహమ్మదీయ చరిత్ర, కొన్ని మరాఠీ ప్రచురణలు చదివాడు. పేష్వాల చరిత్రకొరకు ఇంగ్లీషువారిచేత వ్రాయబడిన చారిత్రిక గ్రంథాలు కూడా చదివాడు. ఆయన వ్రాసిన "మహిసురాచా వాఘ్" మెడోస్ వ్రాసిన "టిపూసుల్తాన్" మీద ఆధారపడ్డది.

"చంద్రగుప్త" నవలలో రాజు చంద్రగుప్తుడు, కౌటిల్యుడు, మురాదేవి, పర్వతేశుడు (అనగా పోరస్) ఈ పాత్రలకు మాత్రము చారిత్రక వ్యక్తులు ఆధారము. "కాల్‌కూట్"లో పృథ్వీరాజ్ చౌహాన్, జయచంద్ ఇద్దరూ ప్రసిద్ధ చారిత్రిక వ్యక్తులు. "ఉషఃకాల్"లో శివాజీ, తానాజీ, యేసాజీ, రామదాసకవి, దాదాజీ (దాదోజీ కొండదేవ్), జిజాబాయి (శివాజీ తల్లి), మురార్‌పంతు (బీజపూర్ నివాసి) అనే చారిత్రిక వ్యక్తులున్నప్పటికీ, చరిత్రకు సంబంధించిన కథా భాగము మాత్రము స్వల్పమే. కానీ దానిలో

స్పష్టమైన చారిత్రక వాతావరణంలోని సంఘటనలన్నింటిని కల్పనాపూర్వకమైన పునర్నిర్మాణం చేయడానికి ప్రయత్నం జరిగింది. "సూర్యోదయ్" లో అఫ్జల్ ఖాన్, శివాజీ, నేతాజీ, గోపీనాథ్ పంత్ (రాయబార సంబంధమైన ప్రతినిధి) వీరు నిజమైన చారిత్రిక వ్యక్తులు. ప్రతాప్ ఘడ్ యుద్ధము, అఫ్జల్ ఖాన్ మరణము ఈ నవల యొక్క కథాంశానికి సంబంధించిన వాస్తవిక చరిత్ర. "సూర్య గ్రహణ్" లో జయసింహుని కోరికమీద, ఆయన ఇచ్చిన హామీల మీద శివాజీ ఆగ్రా కెళ్లిన ప్రసిద్ధ చారిత్రిక సంఘటన, ఔరంగ్ జేబ్ ఆయనను నిర్బంధించడం అనే సంఘటన చరిత్రనుండి గైకొనబడ్డాయి. "గడ్ ఆలాపణ్ సింహ్ గేలా" ఉదయభాను నుంచి తానాజీ సింహఘడ్‌ను స్వాధీన పరచుకోవడం వర్ణించబడింది. సూర్యాజీ, షేలార్ మామ, రాయబా అనే పాత్రలుండడంవల్ల తగినంత చారిత్రిక వాతావరణం కూడా ఏర్పడింది. సూర్యాజీ చేశాడని చెప్పబడుతున్న నేరారోపణనుండి ఆయన ఇప్పుడిప్పుడు విముక్తి పొందుతున్నాడు. "కేవల్ స్వారాజ్యాసాఠీ" లో శివాజీ మరణము, ఔరంగ్ జేబ్ సేనలు రాయ్‌ఘడ్‌ను స్వాధీనపరుచుకోవడం, రాజారామ్ జింజీకి హుటాహుటి పోవడం, శంభాజీ కుమారుడు శివాజీని, అతని తల్లి ఏసుబాయిని ఔరంగ్ జేబ్ ఖైదు చేయడం అనే చరిత్రాంశాలు చిత్రించబడ్డాయి. "వజ్రమాత్" లో తల్లికోట యుద్ధము, విజయనగర సామ్రాజ్య వినాశము వర్ణించబడ్డాయి. ఆ నవలలో రామరాజు మినహా మిగిలిన పాత్రలన్నీ పూర్తిగా కల్పితాలు.

ఇతిహాస సంబంధమైన చాలా వివరాలను ఆప్టే పూర్తిగా ఉపయోగించుకొన్నాడు. కాని తను రచించే చరిత్రను తనకు సమకాలీనులైన స్త్రీ పురుషులతో నింపివేశాడు. ఆంగ్ల సాహిత్యంలో

స్కాట్ ఇదే పనిచేశాడు. నేల గదులు, దేవాలయాలు, గూఢ చారులు, సామంత ప్రభువులు, కోటలు, బీజపూర్, ఆగ్రా, రాయ్ ఘడ్, పూనావంటి రాజకీయమైన ముఖ్యపట్టణాలు, ఇవన్నీ వీటిలో ఉపయోగింపబడడంచేత మధ్యయుగ చారిత్రక వాతావరణము ఈ నవలలలో ప్రత్యక్ష మవుతుంది. కాని ఈ నవలలలో మనకు కాన వచ్చే యువక పాత్రలలో చాలామంది (పురుషులుగాని, స్త్రీలు గాని) ఆప్టేకు సమకాలీనులు, దేశభక్తి పరాయణులు అయిన యువ కులవలె మాట్లాడుతారు. నాటకాలలో మొదటి రంగాలు ఆకర్షకాలు అయినట్లు, ఈయన నవలలు చాలా వాటిలో ప్రథమాధ్యాయాలు ఎంతో ఆకర్షణీయంగా వుంటాయి. సూచన ప్రాయమైన వివరాల సహాయంతో ఆయన కథలో సంశయ స్థితిని సృష్టించి పోషి స్తాడు. అతీంద్రియ శక్తులకు సంబంధించిన మధ్య యుగపు భావాలు (కాల్ రిడ్ పద్యాలలోవలె), సాంకేతిక భావ ప్రకటనలు ("సూర్యో దయ్" లో పెద్ద పులుల పోట్లాటవలె), ప్రతీకార భావాలు. ఉప కథా కల్పనలు (ఒక్కొక్కప్పుడు రెండు. మూడు కూడ), చిన్న చిన్న గూఢ కల్పనలు, మారువేషాలు ("ఉషఃకాల్", "సూర్యో దయ్" లోవలె), జ్యోతిష్కులు, రాజపుత్రుల ధైర్యసాహసాలు. ("రూప్ నగర్ చీరాజకన్యా" లోవలె). దేశ సంచారులైన గాయ కులు, గేయకర్తలు, గ్రామీణుల భాష, వారి యాస మాటలు, సైనిక శిబిరాలు, రాజ భవనాలు ఇవన్నీ కలిసి ఆకర్షకమైన అధ్యా త్మిక పరిసరాలచే ఆవరింపబడిన మధ్య యుగపు వాతావరణాన్ని సృష్టించడానికి తోడ్పడతాయి. కాని ఈ నవలలో చారిత్రిక సత్యం కొద్దిగానైనా లేకపోలేదు (బహుశః "రూప్ నగర్ చీరాజ్ కన్యా" లో తప్ప). ఈ నవలలు కూడా ధారావాహికంగానే వెలు వడ్డాయి. అందువల్ల అతిదీర్ఘత, పాత్రల పేర్లను గురించిన తికమక లోప

భూయిష్ఠమైన నిర్మాణము, పాత్రలను, పద్ధతులను తిరిగి తిరిగి ప్రవేశ పెట్టడం, సంఘటనల సారూప్యత ఆయన సాంఘిక నవలలలోవలెనే వీటిలో కూడా ఉన్నాయి. ఆప్టే, స్కాట్ ఒక్క విషయంలో భేదిస్తారు. స్కాట్ చరిత్ర విషయంలో సాంప్రదాయ విరుద్ధమైన దృష్టికలవాడు. ఆప్టే తన పాఠకులలో ఆదర్శాన్ని నెలకొల్పడానికి ప్రయత్నిస్తాడు. ఆయన శైలి, రచనా విధానము కాలానికి అనుగుణముగా ఉండడమే కాక లాలిత్యానికి వరవడిగా ఉంటాయి.

ఆప్టే తన చారిత్రిక నవలలలో స్త్రీ పురుష పాత్రలను సుమారు నూటిని చిత్రించాడు. అందులో అరవై మంది చారిత్రిక వ్యక్తులే. రాక్షసుడు - చంద్రగుప్తుడు, రణ్‌మస్త్‌ఖాన్ - రామరాజు, శహాజీ - ఆదిల్‌షా, ఔరంగ్‌జేబ్ - అఫ్‌జల్‌ఖాన్ - ఉదయభాను. శివాజీ - ఔరంగ్‌జేబ్, శంభాజీ - రాజారామ్, జయచంద్ - పృథ్వీరాజ్, మాధవ్‌రావ్ - రఘునాథరావ్ ఈ జంటలలో ఒక మంచి పాత్రకు రెండవ పాత్ర గుణవర్ధకంగా ఉంటూ, మంచి - చెడుల పోరాటంలో మంచి ఎలా గెలుపు పొందుతుందో చూపుతాయి. అత్యుత్సాహవంతులు, స్వార్థత్యాగులు అయిన స్త్రీ పురుషులు, మంచి పనులకు సహాయం చేసిన వివేకవంతులైన మహాత్ములు, తమ తమ మతాలలో మూఢ నమ్మకాలలో పట్టుదలగల పురుషులు. హింసాత్మక చర్యలు - వాటి ఫలితాలు, శ్రద్ధాభక్తి సంపన్నులు. ద్రోహులు, చంచల మనస్కులు, కృత సంకల్పులు - పాఠకుల ఔత్సుక్యాన్ని వృద్ధిపరచడానికే తోడ్పడతారు. సత్యవాదిత్వానికి, సత్యశీలానికి, ధైర్యానికి, సూక్ష్మబుద్ధికి, జ్ఞాపకశక్తికి, అవ్యగ్రచిత్తానికి "సావళ్యా" అనే పాత్రను పాఠకులు ఎల్లప్పుడు జ్ఞాపకం ఉంచుకుంటారు. ఆ పాత్రను ప్రధాన పాత్రచేసి ఒక నవ

లను వ్రాయాలని ఆయన సంకల్పం నెరవేరలేదు. ఈ కొద్ది పరిమితిలో ఆయన చిత్రించిన పాత్రలన్నింటిని చర్చించడం సాధ్యంకాదు. కాని చారిత్రిక నవలలో ప్రసిద్ధ పాత్రలు - రాక్షసుడు (చంద్రగుప్త), రనదుల్లాఖాన్ (ఉషఃకాల్), నమన్‌పాల్ (రూప్‌నగర్ చీరాజ్ కన్యా), తారాబాయి (సూర్యోదయ్), రణదేవి (సూర్యగ్రహణ్) కోట అధికారి భార్యవంటివి - చాలా ఉన్నాయి. చారిత్రిక నవల లలో "ఉషఃకాల్", "రూప్‌నగర్ చీరాజకన్యా", "వజ్ర ఘాత్", "గడ్ ఆలాపణ్ సింహ్‌గేలా", అనే నవలలు పాఠకులను ఆకర్షించి వారిని మంత్ర ముగ్ధులను చేస్తాయి.

మరాఠీ సాహిత్యంలో చారిత్రిక నవలా కర్తగా ఆప్టే పేరు చిరస్థాయిగా ఉంటుంది. సాంఘిక నవలలు భావితరం వారిలో అంతగా అభిరుచిని కలిగించక పోవచ్చు.

నవలలే కాక ఆయన కృతులు చాలా ఉన్నాయి. పద్యాలు చాలా వ్రాశాడు. నాటకాలు, వ్యాసాలు కొన్ని అనువాదం చేశాడు, మరికొన్ని స్వయంగా వ్రాశాడు. ఇప్పుడు "చిన్నకథ" అనే పేరు గలవి, చిన్నచిన్న జీవిత చరిత్రలు వ్రాశాడు. చాలా ఉపన్యా సాలు ఇచ్చాడు. అందులో కొన్ని గ్రంథ రూపంలో ప్రచురింప బడ్డాయి.

## ఏడో అధ్యాయము

# కవిత, నాటకాలు

ఆప్టే కవిత్వం విషయం తీసుకొంటే విద్యార్థి దశలోనే ఆయన "శిష్యజన విలాప్" అనే శోక గీతాన్ని వ్రాశాడు. అది ఆయన తరువాత వ్రాసిన పద్యాలకు అగ్రగామి. ఆయన విస్తారంగాను, నియతంగాను పద్య రచన చేయలేదు. ఆయన పద్య రచన చాలా వరకు ఇంగ్లీష్‌నుండి అనువాదమే. ఉదాహరణకు లాంగ్ ఫెల్లో వ్రాసిన "జీవిత గీతము", షెల్లీ వ్రాసిన "స్కైలార్క్" అవిగాక కొన్ని చిన్న పద్యాలు సంస్కృతనుండి కూడ అనువదించాడు. "గడ్ ఆలాపణ్ సింహ్ గేలా" లో ఆయన వ్రాసిన కల్పిత గేయము చాలా ప్రసిద్ధమైనదీ, అందమైనదీను. దానిలో వీర రసము తొణికిసలాడుతూ ఉంటుంది. విషయంలోను, విధానంలోను పురాతన "పదాలను" ఆయన బాగా అనుకరించ కలిగేవాడే. అవి పురాతన "పద" కర్తల పేర్లతో సులభంగా చలామణీ ఆయ్యేవి కూడాను. "శాంతి మంగళ్" అనే పేరుతో పద్యాలలో ఒక పెద్ద కృతిని - అంటే ఆయన మహారాష్ట్ర జ్ఞాపకార్థము ఒక పురాణాన్ని - ఆయన తలచాడు. కాని అందులో మొదటి ఇరవై రెండు పద్యాలు - అంటే "విద్యావతరణము" ను గురించి వ్రాసినవి - మాత్రం దొరికాయి. హాస్య రసపూరితాలైన పద్యాలు కొన్ని వ్రాశాడు. కాని అవి ప్రస్తుతం బొత్తిగా దొరకడం లేదు. రవీంద్రనాథ్ టాగూర్ వ్రాసిన "గీతాంజలి"ని ఆయన వచనంలోకి అనువదించాడు. అనువాదంగా

అది చాలా మంచి గ్రంథమే. అసలు గ్రంథంలోని భావం దానిలోకి అంతంగా తీసుకొని వచ్చాడు. కాని అది వచన గ్రంథం కావడం చేత స్వరమాధుర్యం కనిపించదు.

"సంత్ సఖూ", "సతి పింగళా" అనే రెండు నాటకాలను ఆప్టే వ్రాశాడు. "సంతసఖూ"లో ఇతి వృత్తము పండరినాథుడైన విఠల్ ప్రభువుయొక్క భక్తురాలిని ఆమె అత్తగారు, భర్త దిగంబర్ పంత్ హింసించిన గాథ. ఆమె పండర్‌పూర్ యాత్ర చేయడానికి నిశ్చయించుకొని బయలుదేరుతుంది. ఆమె అత్తగారు, భర్త ఆమెను వెనుకకు లాక్కొనివచ్చి, బాధించి, సంకెళ్లు వేసి ఒక గదిలో ఉంచుతారు. విఠల్ స్వామి ఆమె ఆకారాన్ని ధరించి, ఆమె అత్తకు, భర్తకు సేవచేయడానికి ఆ యింటిలో నిలిచిపోయి, ఆమె చేయదలచుకొన్న యాత్ర చేసిరావడానికి అవకాశం కల్పిస్తాడు. భగవద్దర్శనము అయిన తరువాత ఆమె అక్కడ చనిపోతుంది. ఆమె గ్రామానికి చెందిన భక్తులే కొందరు ఆమెకు అంత్యక్రియలు జరుపుతారు. విఠల్ ప్రభువు భార్య రుక్మిణీదేవి ఆమెను బ్రతికించి ఇంటికి పంపుతుంది. వాళ్ల గ్రామంలో వారు ఆమెను గుర్తుపడతారు, కాని ఆమె దయ్యమై వచ్చిందని భావించి వెంటబడి తరుముతారు. అశరీర వాణి పలుకులతో రహస్యము చివరకు బయటపడుతుంది. ఈ నాటకం "కరమణూక్" వసంతర్తు సంచికలో 1-1-1911 న ప్రకటితమయింది. ఈ నాటకం "దృష్టాంత నాటకము"ని, లోకమాన్య తిలక్ బ్రిటిషు వారితో చేస్తున్న పోరాటాన్ని దృష్టాంతంగా పెట్టుకొని ఆప్టే ఈ నాటకాన్ని వ్రాశాడని కొందరు అభిప్రాయపడ్డారు. శివ్‌రామ్ మహాదేవ్ పరాంజపే, కృష్ణాజీ ప్రభాకర్ ఖాడిల్‌కర్ వ్రాసిన

దృష్టాంత నాటకాల వంటిదే ఈ నాటకం కూడ. క్రూరమైన బ్రిటిష్ ప్రభుత్వము అత్తగారుగాను, దేశద్రోహులు ఆమె కుమార్తెగాను చిత్రింపబడ్డాయి. గదిలో సంకెళ్లతో ఖైదు చేయబడడమనేది తెలుస్తూనే ఉంది గదా! నాటకాంతంలో భగవత్సహాయంతో సఖు విడుదల కావడంతో ప్రేక్షకుల చిత్తక్షోభకు ఉపశమనం కలుగుతుంది. ఈ దృష్టాంత నాటక ప్రదర్శన సమయంలో ప్రేక్షకులు అసలు విషయాన్ని గ్రహించి చప్పట్లు కొట్టేవారు. నాట్యకళా ప్రవర్తక నాటక సమాజంలోని ప్రసిద్ధ నటులు సవాయీ గంధర్వ, వరహారి కరాంజపే అనేవారు, వాసుదేవ్ రావ్ పట్ వర్ధన్ అనే ఆయన స్వయంగా తన భజన సమాజంతోను, తన మృదంగంతోను. మాస్టర్ కృష్ణన్ రావ్ మరాఠే, ఆయనవంటి మరి కొందరు రెండవ తరగతి నటులు కలిసి ఈ నాటకాన్ని దిగ్విజయంగా ప్రదర్శించేవారు. నాటకశాలలు పట్టకుండా ప్రేక్షకులు వచ్చేవారు. డబ్బూ పుష్కలంగా వసూలయ్యేది. ఈ నాటకం చిరకాలం జ్ఞాపకముంటుంది. ఈ నాటకంలోని కథ మహీపతి విరచితమయిన "సంత్ విజయ్"నుండి గ్రహించబడింది.

●

రెండవ నాటకం "సతి పింగళా" శ్రీధర విరచితమయిన "భక్తిలీలామృత్" అనే గ్రంథంలోని ఒక కథపైన ఆధారపడ్డది. ఉజ్జయినీకి చెందిన కాలకాచార్య కథ అనే జైన కథ, ప్రసిద్ధ సంస్కృత నాటకము "మృచ్ఛకటికమ్"యొక్క కొన్ని ఛాయలు కలిసి ఈ నాటకంలో కథ తయారయింది. ఈ నాటకం జయప్రదమైన రచన కాలేదు.

మూడు నాటకాలను, మూడు ప్రహసనాలను ఆప్టే అనువాదము చేశాడు. "జయధ్వజ్" విక్టర్ హ్యూగో వ్రాసిన

"హెర్నాని" పైనా, "శ్రుత కీర్తి చరిత" కాంగ్రీవ్ వ్రాసిన "దుఃఖిత అయిన పెండ్లి కూతురు" మీదనూ, "సుమతీ విజయ" షేక్స్పియర్ వ్రాసిన "యుతికి ప్రతి" పైనా ఆధారపడినాయి. ప్రహసనాలు మూడూ ఫ్రెంచి నాటక రచయిత మోలియర్ రచనలవే ఆధారంగా కలిగి ఉన్నాయి. "ఘూర్త విలసితా" అనే ప్రహసనం "టర్ టఫ్" మీదను, "మానూన్ ముల్ కున్ వైద్యబావా" అనేది "లా మెడిసిన్ మాల్ గ్రేయా" మీదను, "జబ్ రీచా వివాహ" అనే మూడవ ప్రహసనము "యల్. మారిబ్ ఫోర్స్" మీదను ఆధారపడి వ్రాయబడ్డాయి. విజాతీయ వాతావరణము అనే లోపంవల్ల (ఒక ప్రహసనంలో హెయ్‌లే అనే పేరు కూడా కనపడుతుంది) ఈ ప్రహసనాలు ప్రజలలో రాణించలేదు.

"చాణాక్ష పణావకలస్" అనే ఉద్రేక పూరితమైన నవలను ఆప్టే వ్రాశాడు. అది ఒక అనువాదము.

ఇక ఆప్టే రచనలలో జ్ఞాపకముంచుకో తగినవి ఆయన వ్యాసాలు. అందులో "షేక్స్పియర్ ఆత్మకథ" అనే పేరుతో (షేక్స్పియర్ పద్యాలమీద ఆధారపడి) రెండు వ్యాసాలు, "మోగ్లే స్మృతులు" అనే పేరుతో రెండు వ్యాసాలు, 'విదగ్ధ వాఙ్మయ" అనే ఉపన్యాసము ఉన్నాయి. "కల్పనా సాహిత్యంలోని తత్వము", "కల్పనా సాహిత్యంలోని వాస్తవికత", భగవద్గీతా ప్రబోధము (శంకరాచార్యస్వామి అద్వైత సిద్ధాంత వివరణము), మహాభారత మండలీసికె, జాన్ స్టూ ఆర్ట్ మిల్ ఉపన్యాసాలలో వ్యక్తమగు నీతి అనే విషయాలపై ఆప్టే ఉపన్యాసాలు యిచ్చాడు. "సవ్వు",

"పురాణకాలపు ఆయుధాలు" అనే విషయాలపై ఆయన ఉపన్యాసాలు చిరకాలము జ్ఞాపకముంటాయి.

బొంబాయి విశ్వవిద్యాలయంలో "విల్సన్ ఫైలలాజికల్ లెక్చర్స్" అనే పేరుతో "మరాఠీ – దాని మూలాధారాలు, అభివృద్ధి" అనే విషయంమీద ఆయన ఇచ్చిన ఉపన్యాసాలు కొంత లోపభూయిష్ఠంగానే ఉన్నాయి. భాషా రంగంలో ప్రస్తావించ తగిన అనేక సమస్యలను వదలివేసి కప్పదాటుగా వెళ్లిపోయాడు.

ఉన్నత పాఠశాల విద్యార్థుల సమక్షంలో ఇచ్చిన చిన్న చిన్న ఉపన్యాసాలు ఇంకా పదమూడు ఉన్నాయి.

ఆయన వ్రాసిన చిన్న కథలు ముప్పై అయిదు. ఆధునిక మరాఠీ చిన్న కథకు అవి మార్గదర్శకాలు. అందులో కొన్ని మంచి అభిరుచి జనకాలుగా వున్నాయి. కానీ వాటిలో వున్న నీతి బోధకత్వం, వాటి మెప్పుదలకు కొంత ఆటంకము కలిగిస్తుంది.

ఆయన చిన్నచిన్న జీవిత చరిత్రలను ఇరవై వ్రాశారు. అందులో భారత దేశానికి, పాశ్చాత్య దేశాలకు చెందిన వీర పురుషుల, నాయకుల జీవిత చరిత్రలున్నాయి. వాటినిబట్టి ఆయన యొక్క స్వజనాదరణీయత వ్యక్తమవుతున్నది. ఆయన గుణగణాలను మెచ్చుకోవడానికి కూడా సావకాశము ఏర్పడుతున్నది.

యాత్రలకు సంబంధించిన ఆయన రచనలో రెండు చదవ తగినవి. మొదటిది "ఖాండ్‌లా పర్వతాల సౌందర్యము", రెండవది "లక్ష్మణ్ ఝూలా."

ఆప్టే సాహిత్యాన్ని గురించి సంక్షిప్త సమీక్ష పూర్తి అయింది. ఆయన ప్రశంసార్హుడైన మరాఠీ రచయిత. శైలికి ఒక ప్రత్యేకత వున్నది. అభిప్రాయాలు ఆకాలపు వాటికంటె ముందడుగు వేశాయి. ఇవే ఆయన వ్యక్తిత్వాన్ని మనఃపూర్వకతను గ్రహింపజేస్తాయి. దేశపు సాంఘిక రాజకీయ జీవితంలో ప్రయోజనకరమైన పాత్రను ధరించిన కొద్దిమంది మేధావంతులైన సాహిత్య వేత్తలలో హరినారాయణ్ ఆప్టే ఒకరు. ఆయన తన రచనలలో చూపిన అకృత్రిమత్వం, ఆయన ఉత్తమ వ్యక్తిత్వానికి ప్రబలమైన ఉదాహరణ. ఆయన మరాఠీ నవలకు నూతన ప్రమాణాన్ని కల్పించాడు. వివిధ సాహిత్య రంగాలలో శ్రేష్ఠుడుగా, ప్రతిభావంతుడుగా ఆయన గ్రంథకర్తగా చిరకాలము జ్ఞాపకముంటాడు. ఆయన రచనలు, అదృష్టవశంచేత. ఆయన శత జయంతి ఉత్సవాల అనంతరము ఇప్పుడు లభ్యమవుతున్నాయి. అందుకు మహారాష్ట్ర ప్రభుత్వం చేసిన సహాయానికి మనము కృతజ్ఞులమై ఉండాలి. ఆయన రచనలను ఆదరించవలసిందిగా మరాఠీ సాహిత్య పాఠకులను మేము వినయపూర్వకంగా కోరుతున్నాము. ఆయన గ్రంథాలను చదవడంవల్ల ఆయన ప్రతిభను వారు వివరముగా తెలుసుకొని లాభము పొందగలుగుతారు.

సమాప్తము

పోలార్ వర్క్స్ : తంబు శెట్టివీధి, మదరాసు-1.

# తెలుగులో వెలువడిన పుస్తకములు

| | | వెల | |
|---|---|---|---|
| | | రూ. | పై. |
| **భారత దేశము—ప్రజలు** | | | |
| భారతదేశ ఖనిజములు | ... | 5 | 75 |
| పెంపుడు జంతువులు | ... | 4 | 50 |
| సామాన్య వృక్షములు | ... | 4 | 25 |
| నికోబార్ దీవులు | ... | 5 | 50 |
| అస్సాం | ... | 3 | 75 |
| ఉద్యాన పుష్పములు | ... | 6 | 00 |
| భారతదేశ ఆర్థిక భూగోళము | ... | 5 | 20 |
| భారతదేశ భౌతిక భూగోళము | ... | 4 | 50 |
| అడవులు-అటవీ శాస్త్రము | ... | 6 | 00 |
| పూలచెట్లు | ... | 5 | 50 |
| ఋతుపవనములు | ... | 3 | 25 |
| ఓషధీ భూజములు | ... | 5 | 75 |
| **జాతీయ జీవిత గ్రంథమాల** | | | |
| సముద్ర గుప్తుడు | ... | 1 | 25 |
| రాణీ లక్ష్మీబాయి | ... | 2 | 00 |
| శంకరాచార్యులు | ... | 2 | 00 |
| అహిల్యాబాయి | ... | 2 | 00 |
| చంద్రగుప్తమౌర్యుడు | ... | 1 | 50 |
| సుబ్రహ్మణ్య భారతి | ... | 2 | 25 |
| గురునానక్ | ... | 2 | 25 |
| త్యాగరాజు | ... | 1 | 75 |
| హర్షుడు | ... | 2 | 00 |

| | రూ. | పై. |
|---|---|---|
| కబీరు ... | 1 | 75 |
| నానా ఫడ్నవీస్ ... | 2 | 00 |
| రామానుజాచార్యులు ... | 2 | 25 |
| స్వామి రామతీర్థ ... | 2 | 50 |
| **ఆదాన్—ప్రదాన్** | | |
| పంజాబీ కథలు ... | 3 | 50 |
| స్మృతి రేఖలు ... | 6 | 50 |
| బన్‌గర్ వాడీ ... | 6 | 25 |
| తమిళ కథలు ... | 4 | 00 |
| తెల్లని రక్తం ... | 4 | 25 |
| జీవిత సంగ్రామము—వీరేశలింగము ... | 4 | 25 |
| మరణానంతరం ... | 4 | 00 |
| కృషి ... | 4 | 75 |
| **ఇతర పుస్తకములు** | | |
| భారతదేశము—నేడు, రేపు ... | 0 | 75 |
| కల్కి: లేక నాగరకత భవిష్యత్తు ... | 0 | 75 |
| జ్వాలాముఖి ... | 3 | 75 |
| ఏక ప్రపంచము భారతదేశము ... | 0 | 75 |
| న్యాడీ ఆత్మ ... | 1 | 50 |
| పోతన ... | 2 | 75 |
| విజ్ఞానం విశేషాలు ... | 1 | 50 |
| నవభారత విద్యా పునర్నిర్మాణము ... | 1 | 25 |
| ప్రాక్ పశ్చిమ పవిత్రాంగనలు ... | 5 | 00 |
| మహా విప్లవ వీరుడు ... | 4 | 25 |
| శాస్త్ర విజ్ఞానము, మానవ జీవితము ... | 2 | 75 |